# రచయిత ముందుమాట

నోబెల్ బహుమతి గ్రహీత మదర్ థెరిసాని పరిచయం చెయ్యాలంటే ఆమె పేదవారందరికీ తల్లి అని చెప్పాలి. ఆమె స్వయంగా అనాథలైన వికలాంగులకీ, చావుకు ఎదురు చూస్తున్న వారికీ సేవ చేసింది. లొరెటో కాన్వెంటుకి చెందిన సెంట్ మేరీజ్ అనే ఒక పెద్ద స్కూలు అధ్యక్షపదవిని వదిలేసి, చేత ఐదు రూపాయలు మాత్రమే పట్టుకుని ఆమె బీదవారి సేవ చెయ్యటానికి బయలుదేరింది. ఆమె మొట్టమొదట కలకత్తాలో మురికి వాడల్లో తన పని ప్రారంభించింది. నేలమీద బొగ్గుతో అ ఆలు రాసి మోతీఝీల్ అనే మురికివాడలో ఆమె మొదటి రోజు ఆరుగురు పిల్లలకి అక్షరాలు నేర్పింది.

మదర్ భారతదేశంలోని మానవతావాదుల్లో ఒకరు. కేవలం మన దేశంలోనే కాకుండా, ప్రపంచం మొత్తంమీద ఉన్న మానవతావాదుల వరుసలో మొదటిస్థానం ఆమెకే చెందుతుంది. తన సంస్థ పనిమీద ఆమె అప్పుడప్పుడూ విదేశాల్లో ఉండవలసి వచ్చేది. కాని ప్రతీసారి ఆమె అక్కణ్ణించి కలకత్తాకి తిరిగి వచ్చేది. కలకత్తా అంటే ఆమెకి అంతులేని ఇష్టం.

ఈ పుస్తకం రాయటానికి నాకు సహాయపడిన వారు శ్యామల్‌సేన్ గుప్తా, నవీన్ చావ్‌లా, సుదేవ్ రామ్ చౌధరి, శాంతా శ్రీమాని, సుశాంత్ కుమార్, షార్లట్‌గ్రే, మదర్ హౌస్ సిస్టర్లు. కలకత్తానుంచి వెలువడిన వార్తా పత్రికల ద్వారా కూడా చాలా విషయాలు తెలిశాయి. నేను వీరందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

**– రాధారమణ్ రాయ్**

# 1. మొగ్గనుండి పువ్వు

మదర్ అసలు పేరు ఏగ్నెస్. ఆమె పూర్తిపేరు ఏగ్నెస్ గోంజా బోజాక్స్యు. కాని ఇప్పుడు ఆమెని అందరూ మదర్ థెరిసా అంటారు. కొందరు ఆమెని టెరెసా అంటారు. 'టెరెసా' అనేవాళ్ళు అంటారు, కానీ సరైన ఉచ్చారణ 'టెరిజా.' ఆమె తల్లి ఆమెను ఏగ్నెస్ అనే పిలిచేది. గోంజా అని అన్న పిలిచేవాడు.

అన్న ఆమెకిచ్చిన గోంజా అనే పేరుకి మొగ్గ అని అర్థం. అంటే తామర మొగ్గ అన్నట్టు, ఒక పూల మొగ్గ అన్నమాట. ఏగ్నెస్ పూవులాగ వికసించి మదర్ థెరిసా అయింది. బీదవాళ్ళలోని అతి బీదవాళ్ళకు కూడా ఆమె అమ్మగా మారింది. ఆకలి, జబ్బులూ, తోడూనీడా లేకపోవటం, ముసలితనంలో వీటి బాధలకి లోనై, వీధుల్లో పడి ఉండేవాళ్ళ అవసరాలు తీర్చటానికి ఆమె నడుం కట్టింది. అప్పట్నుంచీ దిక్కూమొక్కూలేని పసివాళ్ళ దగ్గర్నించి ముసలివాళ్ళ వరకూ, అందరికీ ఆమె 'అమ్మ' అయింది.

తల్లి తన పిల్లల్ని పెంచి పెద్దచేసి, వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళు నిలబడేటట్టు నేర్పుతుంది. మదర్ థెరిసా అనాథలైన పిల్లలకే కాదు, దిక్కులేని ముసలివాళ్ళకు కూడా సేవచేసి వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళు నిలబడేటట్టు చేసింది.

మదర్ ఈపని మొట్టమొదట కలకత్తాలో మొదలు పెట్టింది. తరవాత భారత దేశంలోని మిగతా ఊళ్ళల్లో కూడా తన సేవనీ, మమతనీ విస్తరింపజేసింది. ఆతరవాత ప్రపంచంలోని ఇతర దేశాల్లో కూడా తన సేవాకార్య క్రమాన్ని ప్రారంభించింది.

స్వాతంత్ర్యం వచ్చాక రాజకీయాలకి దూరంగా ఉంటూ పేదవారికి సేవచేస్తూ. దేశసేవ చేసేవారిలో మదర్ థెరిసా స్థానం మొదటిది. బీదవారికి సేవ చేయటంద్వారా, తాను దేవుడికి సేవచేస్తున్నానని ఆమె అనేది. ఈ రకంగా దేవునికి సేవచేయటం ఆమె జీవితంలోని ముఖ్యమైన ఉద్దేశం.

పాలన పేరుతో ప్రజల్ని పీడించే దేశాల్లో డబ్బున్నవాళ్ళు కొద్దిమందే ఉంటారు. మిగతా వారంతా పేదలే. ఆదేశాల్లో ముష్టివాళ్ళని చెత్తకుండీల కింద చూస్తారు. చెరుకుని పీల్చాక దాని పిప్పి బయట కొచ్చినట్టుగా, ముష్టివాళ్ళు పుట్టుకొస్తారు. వాళ్ళ బాధల్ని పోగొట్టాలని ఎవరూ ప్రయత్నించరు. వాళ్ళ సంఖ్య రోజురోజుకీ పెరుగుతునే ఉంటుంది. దీని వల్ల దేశంలో దొంగతనాలూ, బందిపోటుతనాలూ, దారి దోపిడీలు పెరిగిపోతాయి. కానీ ఈ ముష్టివాళ్ళకి తిండీ, బట్టా, ఉండటానికి ఇల్లు ఇచ్చి వాళ్ళని సంఘసేవలో పెడితే, దేశంలో జరిగే అపరాధాలనీ, అపరాధులనీ చాలావరకు ఆపవచ్చు. దీనివల్ల అందరికీ మేలు కలుగుతుంది. మదర్ థెరిసా బతికున్నన్నాళ్ళూ అందరికీ మేలు కలిగే పనులే చేపట్టింది.

తను బీదగా ఉండికూడా బీదవారికి సహాయం

చేయవచ్చున్న విషయాన్ని మదర్ తన సేవాభావంతో చేసి చూపించింది. లొరెటోలో ఉన్న సదుపాయాలన్నీ వదిలేసి కేవలం 5 రూపాయలతో ఆమె వీధిలోకొచ్చింది. చనిపోయేవరకూ ఆమెదగ్గర తనదని చెప్పుకోటానికి మూడు చీరలు తప్ప ఏమీ లేవు. కాని ఆమె చేసిన పనులు పెరిగి, పెరిగి ప్రపంచం నలుమూలలా వ్యాపించాయి. అమ్మని ఇంకెవ్వరితోనూ పోల్చలేం. ఎందుకంటే పిల్లల్ని తల్లిలాగ ప్రేమించగల వాళ్ళెవరూ ఉండరు. కాని అందరూ అమ్మల్లోకీ గొప్పది మదర్ థెరిసా. సాధారణంగా అమ్మతన పిల్లల్ని మట్టుకే జాగ్రత్తగా చూసుకుంటుంది. కానీ మదర్ థెరిసా అలాకాదు. ప్రపంచమంతటా వీధుల్లో తిరిగే అనాధ పిల్లల్ని ఆమె సమానంగా ప్రేమించింది. అందుకే ఆమె అందరి అమ్మలకన్నా గొప్పదయింది.

రాజకీయనాయకులూ, ఆటగాళ్ళూ, సినిమా వాళ్ళూ అందరికీ తెలుసు. వీళ్ళందరితోబాటు జనం అందరికీ తెలిసిన ఇంకోపేరు మదర్ థెరిసాదే ! మనదేశంలో పుట్టకపోయినా ఆమె మనదేశంలోని మనుషులందరి కన్నా గొప్పది. ఆమె ఒక మొగ్గగా విదేశంలో పుట్టింది. కాని మనదేశం మట్టిలో ఆమె కమలంలా విరిసింది. ఆమె మనదేశంలోని పువ్వుల్లో అన్నిటికన్నా అందమైనది. అందరికన్నా మంచి అమ్మ !

# 2. బాల్యం

మదర్ అసలుపేరు ఏగ్నెస్ గోంజా అని ఇంతకుముందే తెలుసుకున్నాం. ఆమె పుట్టిన రెండోరోజు ఆమెకి పేరుపెట్టారని అంటారు. ఆమె 1910 ఆగస్టు 26న యుగోస్లావియాలోని స్కోపియే అనే ఊళ్ళో పుట్టింది.

అప్పట్లో స్కోపియే ఆటోమన్ సామ్రాజ్యంలోని అల్బేనియాలో ఉండేది. అల్బేనియాని టర్కీవారు పాలించేవారు. అక్కడ అన్ని మతాల వాళ్ళు ఉండేవారు. వారిలో కాథలిక్ క్రిష్టియన్ల సంఖ్య అందరికన్నా తక్కువగా ఉండేది.

స్కోపియే చిన్న ఊరు. అక్కడ ఆరోజుల్లో జనాభా దాదాపు 25000. ఆ ఊళ్ళోనే ఏగ్నెస్ ఇల్లుకూడా ఉండేది. ఆమె తండ్రి పని భవనాలు కట్టడం. కాంట్రాక్టుకి తీసుకుని వాటిని కట్టి ఇచ్చేవాడు. ఈపని లో ఆయన బోలెడంత డబ్బూ, కీర్తి సంపాదించాడు.

ఆయన పేరు నికోలస్ బొజాక్సయు. తల్లిపేరు డ్రానాఫిల్ బార్నాయి. వారికి ఏగ్నెస్ తో కలిపి మొత్తం ముగ్గురు పిల్లలు. ఇద్దరు ఆడపిల్లలు, ఒక మొగపిల్లవాడు. అందరిలోకి ఏగ్నెస్ చిన్నది. ఆమె అక్కపేరు ఏగే. అన్నపేరు లాజార్.

ఆకుటుంబం సుఖసంతోషాలతో నిండి ఉండేది. నికొలస్ పని భవనాలు కట్టడమైనప్పటికీ, ఆయనకి రాజకీయాల్లోనూ ప్రవేశం ఉండేది. స్కోపియాలోని మొట్టమొదటి నాటకశాలను ఆయనే నిర్మించారని చెప్పుకుంటారు. ఊళ్ళోని పరిషత్తులో కూడా ఆయన సభ్యునిగా ఉండేవారు. ఆయనకి చాలా భాషలు వచ్చు. బీదవారిని ఆయన ఎప్పుడూ ఒట్టి చేతులతో పంపలేదు. ఆయనది చాలా మెత్తని మనసు.

తల్లి డ్రానాఫిల్ కూడా జాలిగుండె కలదే. ఆమె భక్తురాలు, పరమధార్మికురాలు కూడా. క్రిస్టియన్ కాథలిక్ మతానికి విరుద్ధంగా ఏ పనీ చేసేది కాదు. ఆమె చాలా తెలివైనది. తన పిల్లల్ని ఎంతో జాగ్రత్తగా చూసుకునేది.

ఆమె తన పిల్లలతో రోజూ ప్రొద్దుటే చర్చికి వెళ్ళేది. తన శక్తికొద్దీ బీదవాళ్లకి తిండి, బట్ట, డబ్బులు పంచేది. అలాంటి సమయాల్లో ఏగ్నెస్ ఎప్పుడూ తల్లి వెంట వుండేది. రాత్రి ఇద్దరూ కూర్చుని ఏసుక్రీస్తు ప్రభువుని ప్రార్థించేవారు.

1917వ సంవత్సరం. ఏగ్నెస్‌కి యేడేళ్ళు. హఠాత్తుగా ఆమె తండ్రి మరణించాడు. రాజకీయాల్లో ఇరుక్కోవటం వలన ఆయన్ని చంపించారని పుకారు. ఏగ్నెస్ వాళ్లఅమ్మ దుఃఖంలో మునిగి పోయింది.

ఆతరవాత వాళ్లకి ఇంకో కష్టం కలిగింది. నికోలస్ తో కలిసి వ్యాపారం చేసే అతను మోసం చేసి మొత్తం డబ్బు కాజేశాడు. దానివలన వీళ్ళ కటుంబం బీదరికంతో పడరాని పాట్లు పడింది.

ఇప్పుడిక వాళ్ళకున్న ఆస్తి మొత్తం ఆ ఇల్లొక్కటే. ఎటువంటి సంపాదనా లేదు. నలుగురు మనుషుల జరుగుబాటు ఎలా ? ఆకలితో మాడి చావటం తప్ప చేయగలిగింది ఏమీ లేదు. ఇల్లు గడవడానికి ఏగ్నెస్ అక్క ఏగే నడుంకట్టుకోవాల్సివచ్చింది. బాధ్యతంతా ఆమె పైన పడింది.

ఎలాగైతేనేం వాళ్ళమ్మ చివరికి ధైర్యం కూడగట్టుకుంది. ఆమె తన జీవితాన్ని కొత్తగా మళ్ళీ ప్రారంభించింది. అల్లికలూ కుట్లూచేసిన బట్టలు అమ్మసాగింది. ఈ వృత్తి చిన్నదే కాని సొంతంగా చేసుకునేది.

1924వ సంవత్సరం. ఏగ్నెస్ కి పద్నాలుగేళ్ళు. ఆమె అన్న మిలిటరీ స్కూల్లో చేరాడు. ఏగ్నెస్ అక్కతోబాటు స్కూలుకెళ్ళడం మొదలు పెట్టింది.

ఏగ్నెస్ ఆమె అక్కా ఇద్దరూ చదువులో చురుగ్గా ఉండేవారు. ఏగ్నెస్ చాలా బాగా రాసేది. ఆమె పెద్దయాక రచయిత్రి అవుతుందని ఆమె అన్న అనుకునేవాడు.

తండ్రి పోయాక ఏగ్నెస్ ఇంట్లోవాళ్ళకి క్రిష్టియన్ మతం పట్ల ఇంకా శ్రద్ధ కలిగింది. ఆ కుటుంబంపైన సేక్రెడ్ హార్ట్ చర్చి ప్రభావం చాలా ఎక్కువగా పడింది. చర్చిలో జరిగే అన్ని కార్యక్రమాల్లోనూ ఏగ్నెస్ అక్కతో పాటు పాల్గొనేది.

పన్నెండేళ్ళ వయసులో ఏగ్నెస్‌కి సన్యాసం పుచ్చుకోవాలన్న కోరిక కలిగింది. ఆమె తన మనసులోని మాట తల్లికి చెప్పింది. కాని తల్లి ఒప్పుకోలేదు.

మొదటి ప్రపంచ యుద్ధం బీదవారిని మరింత బీదవారిగా

చేసింది. ఇది ఏగ్నెస్ ఉండే బాల్కన్ ప్రాంతం నుంచే ప్రారంభమైంది. యుద్ధం మూలాన వస్తువుల ధరలు పెరిగాయి. తిండి వస్తువులు దొరకడం కష్టమైంది. విదేశ పాలకుల అత్యాచారం ఎక్కువవుతూ వచ్చింది. ఏగ్నెస్ కుటుంబం కూడా దీనివల్ల కష్టాలు పడింది.

స్కూల్లో ఏగ్నెస్ ఏసుప్రభువు దూతల గురించి విన్నది. ఆ రోజుల్లో యుగోస్లావియాలోని ఏసుప్రభువు దూతలు బెంగాలులో కూడా సేవా కార్యక్రమాలు చేసేవారు. కలకత్తాలోనూ, డార్జిలింగ్ లోనూ వాళ్ళ కేంద్రాలుండేవి.

ఏసుప్రభువు దూతలు 1924 లో బెంగాలుకి వచ్చారని అంటారు. వారు తాము చేసే పనులగురించి ఉత్తరాల ద్వారా తెలిపేవారు. ఆ ఉత్తరాల్లో కలకత్తా, డార్జిలింగ్‌లోని పేదవారి గురించి వివరాలుండేవి. ఏగ్నెస్ స్కోపియాలో ఉండే ఫాదర్ జెంబ్రెనకొవిక్ ద్వారా వాళ్ళగురించి మరిన్ని వివరాలు తెలుసుకుంది.

అప్పట్నించీ ఆమె మనసునిండా కలకత్తాగురించిన తలపే. కలకత్తాలో పేదలపట్ల ఆమె మనసులో సానుభూతి చోటుచేసుకుంది. అప్పుడే ఆమె బీదలకు సేవ చేయటం ద్వారా భగవంతుణ్ణి సేవించుకోవచ్చు అన్న విషయం తెలుసుకుంది.

అలా స్కోపియాలో ఉండగానే ఆమె కలకత్తామీద మమకారం పెంచుకుంది. అక్కడి వీధుల్లో దేవుడు బీదవాళ్ళ రూపంలోనూ, దిక్కులేని వారి రూపంలోనూ, తిరుగుతుంటాడు. ఆమె దృష్టిలో కలకత్తాయే దేవుడుండే

చోటు, పవిత్రమైన స్వర్గం.

ఏగ్నెస్ మొదటిసారి తల్లికి తన మనసులోని మాట చెప్పినప్పుడు ఆమె వయసు పన్నెండు సంవత్సరాలు. అప్పుడు తల్లి అడ్డుపడింది. ఇప్పుడు ఏగ్నెస్ వయసు పద్దెనిమిదేళ్ళు. ఆరేళ్ళ తర్వాత ఆమె మళ్ళీ తనతల్లికి తన కోరిక తెలియ బరిచింది. ఈసారి తల్లి ఒప్పుకుంది. తన కూతుర్ని ఇక ఇంటికి పరిమితం చేయటం సబబు కాదని ఆమె గ్రహించింది. దేవుణ్ణి సేవించుకోటానికి తన కూతురు ఎన్నుకున్న మార్గంలోనే ఆమెని వెళ్ళనివ్వటం సరైనదని ఆమె అనుకుంది.

ఏగ్నెస్ బెంగాలులోని లొరెటో సంస్థకి తన మనసులోని భావాలన్నీ ఉత్తరంగా రాసింది. నిజానికి ఆ ఉత్తరం ఒక దరఖాస్తు వంటిది. ఆమెని ఐర్లండు వెళ్ళి ఇంగ్లీషు నేర్చుకోమనీ, ఆ తరువాతే ఆమెని బెంగాలుకి రానిస్తామని జవాబు వచ్చింది.

సెప్టెంబర్ 26, 1928. ఆమె పుట్టినరోజు తర్వాత అతి ముఖ్యమైన తేదీ ఆమె జీవితంలో ఇదే. ఏగ్నెస్ తల్లితోనూ అక్కతోనూ కలిసి యుగోస్లావియాలోని జాగ్రెవ్ రైల్వేస్టేషన్ చేరుకుంది. స్కోపియా నుంచి ఆమె రైల్లో అక్కడకి వచ్చింది. చాలా రోజులతర్వాత అదే స్టేషన్‌లో ఆమె తల్లీ, అక్కా దగ్గర్నుంచి వీడ్కోలు తీసుకుంది. ఆమె తల్లిని ఆఖరుసారిగా అప్పుడే చూసిందని అంటారు. ఏగ్నెస్ ని సాగనంపేటప్పుడు తల్లీ, అక్కా ఏడుపు ఆపుకోలేక పోయారు.

నవంబరు 29, 1928న ఏగ్నెస్ డబ్లిన్ నుండి నౌకలో భారతదేశానికి బయలుదేరింది. కలకత్తా చేరటానికి ఆమెకి

ఏడువారాలు పట్టింది. జనవరి 6, 1929న ఆమె కలకత్తా చేరింది. ముగ్గురు ఫ్రాన్సిస్కన్ సిస్టర్లతో నౌకలో ఆమెకు పరిచయమయింది. అప్పుడు నౌకలోనే వారందరూ కలిసి క్రిస్మస్ పండుగ జరుపుకున్నారు.

## 3. ఏగ్నెస్ నుంచి థెరిసా

జనవరి 6, 1929న ఏగ్నెస్ కలకత్తా వచ్చింది. అక్కడ కొన్నాళ్ళు ఉన్న తర్వాత ఆమె డార్జిలింగ్ వెళ్ళింది. అక్కడి లోరెటో కాన్వెంట్ ఆశ్రమంలో, నొవిషియెట్ అంటే విద్యార్థులు ఉండేచోట, ఆమె బస చేసింది.

ఆ రోజుల్లో ఇండియాలో ఉండే ఇంగ్లీషువారి పిల్లలు చదువుకోటానికి డార్జిలింగ్ వెళ్ళేవారు. ఇక్కడ బాగా ధనవంతులైన వాళ్ళుకూడా తమ పిల్లల్ని అక్కడికి పంపేవారు. ఆరోజుల్లో ఇంగ్లీషు వాళ్ళు డార్జిలింగ్‌లో ఒక పెద్ద విద్యాకేంద్రం స్థాపించారు. మిషనరీలు నడిపే ఆ స్కూలు ధనవంతుల పిల్లల కోసమే కేటాయింప బడింది.

ఏగ్నెస్ ఈ కాన్వెంట్‌లోనే అధ్యాపకురాలిగా తన జీవితం ప్రారంభించింది. ఒక పక్క తను కూడా చదువుకుంటూ ఉండేది. ఇక్కడ చాలా శ్రద్ధగా ఇంగ్లీషు, బెంగాలీ భాషలు నేర్చుకుంది. కొద్దిగా హిందీ కూడా నేర్చుకుంది. అక్కడ రోజూ ప్రార్థనలో పాల్గొనవలసి వచ్చేది. రెండు గంటలసేపు బీద పిల్లలకి చదువు చెప్పవలసి వచ్చేది. నేర్చుకోవటం, నేర్పటం ఇవే ఆమె పనులు.

డార్జిలింగ్‌లో ఉంటున్నప్పుడు ఏగ్నెస్ అక్కడి ఆసుపత్రిలోని రోగులకు కూడా సేవచేసేది. మన దేశంలోని దీనులనూ, బీదవారినీ ఆమె ఇక్కడే మొదటి సారిగా చూసింది. రోగులు చాలా దూరంనుండి నడిచివచ్చి చికిత్స చేయించుకునేవారు. ఒక్కొక్కప్పుడు రోగి అక్కడికి చేరుకోటానికి 3 గంటలు కూడా పట్టేది. రోగులకు చెవుల్లోనూ, ఒంటిమీదా పుండ్లు ఉండేవి.

చూస్తుండగానే రెండేళ్ళు గడిచిపోయాయి. ఏగ్నెస్ విద్యలో మొదటి మెట్టు పూర్తయింది. ఇక లోరెటో సంఘం సిస్టర్‌గా ఆమె తన కొత్త జీవితం ప్రారంభించబోతోంది. ఈ కొత్త జీవితంలో ఆమెకి ఒక కొత్తపేరు కూడా అవసరమైంది.

మార్చి 24, 1931. ఏగ్నెస్ జీవితంలోని మరొక మరపురాని దినం. ఆరోజు ఆమె సిస్టర్‌గా మూడు శపథాలు తీసుకుంది. అవి నిరాడంబరత, బ్రహ్మచర్యం, క్రమశిక్షణ. ఈ రకంగా ఆమె కొత్త జీవితం ప్రారంభించింది.

కొత్తపేరు ఎన్నుకునేటప్పుడు ఏగ్నెస్‌కు లిసిఊ కాన్వెంట్ లోని ఒక ఫ్రెంచి సన్యాసిని జ్ఞాపకం వచ్చింది. ఆమెపేరు థెరెసా మాత. 24 యేళ్ళ వయసులో ఆమెకు టి.బి. వచ్చి చనిపోయింది. చనిపోయే ముందుకూడా ఆమె మిషనరీల మంచికోసం ఎల్లప్పుడూ ప్రార్థన చేస్తూ ఉండేది. తన వ్రతం సఫలం కావాలని కోరుకునేది. ఆమెలోని ఈ ప్రేమభావాన్ని చూసి అందరూ ఆమె అంటే ప్రాణం ఇచ్చేవారు. ఎంత చిన్న పనైనా సరే ఆమె ఎంతో శ్రద్ధగా చేసేది. ఆమె వ్యక్తిత్వం కేథలిక్కులకు ఆదర్శప్రాయమైంది. ఈశ్వరుణ్ణి సేవించుకునే

ఈ మార్గానికి ఆమె 'చిన్న మార్గం' అని పేరు పెట్టింది. 1927 లో వేటికన్ ఈ సన్యాసిని ని సన్మానించిందని వినికిడి. ఏగ్నెస్‌కు ఆమెనుంచి మంచి ప్రేరణ లభించింది. అందుచేతే ఆమె తనపేరు 'థెరెసా' అని పెట్టుకోవాలనుకుంది.

కాని అది అంత సులభంగా జరగలేదు. సిస్టర్ బ్రిన్ అనే ఒక సన్యాసిని సంవత్సరం క్రితమే తన శిక్షణ పూర్తిచేసుకుని మేరీ టెరేస్ ( అక్కడి ఉచ్చారణ ప్రకారం మారీ థొరెస్) అనే పేరుతో పిలువబడుతూ ఉంది. మరిప్పుడిక ఏంచెయ్యాలి ?

కాని దీనికి ఒక ఉపాయం దొరికింది. ఏగ్నెస్ తనంతట తనే ఈ ఉపాయాన్ని కనుక్కుంది. ఆపేరు ఉచ్చారణలో కొద్దిగా మార్పు చేసింది. తన పేరు స్పానిష్ ఉచ్చారణ ప్రకారం రాద్దామని నిర్ణయించుకుంది. తన పేరు సిస్టర్ థెరిసా, అని మార్చుకుంది. ఆమె బెంగాలీ భాష క్షుణ్ణంగా నేర్చుకుంది. ఎంటలీ లోని సెయింట్ మేరీజ్ స్కూల్లో ఆమె బెంగాలీ నేర్పేది. దాంతో ఆమెపేరు 'బెంగాలీ థెరిసా' గా మారింది. నిజానికి సిస్టర్ మారీ టెరెస్ బ్రిన్ పేరుకీ, ఈమె పేరుకీ తేడా తెలియాలని ఆమె పేరు ముందు 'బెంగాలీ' తగిలించారు. కాని కాలక్రమాన ఆ 'బెంగాలి' అనే మాట మాయమైంది. ఎందుకంటే అప్పటికి ఆమె పూర్తిగా బెంగాలీ స్త్రీగా మారిపోయింది.

సిస్టర్ థెరిసా మనస్ఫూర్తిగా బెంగాలీగా మారి, బెంగాలులో ఉంటూ అక్కడి పిల్లలకీ, ముసలివాళ్ళకీ సేవ చేస్తూ భగవంతునికి సేవ చేసుకోవాలని నిశ్చయించు కుంది.

ఎంతో దుఃఖంలో ఉంటూ, ఏ తోడూ నీడా లేక, ఉండటానికి ఇల్లూ, తినటానికి తిండీ, కట్టుకోటానికి బట్టాలేక ఆకలి చావులతో అలమటించేవాళ్ళ సేవ చేయటానికి పూనుకుంది. ఈ సేవా కార్యక్రమం ఒకనాడు మొదలై ప్రపంచమంతా వ్యాపించింది.

## 4. అధ్యాపకురాలు థెరిసా

1931లో సిస్టర్ థెరిసా ట్రైనింగు పూర్తి చేసుకుని డార్జిలింగ్ నుంచి కలకత్తా వచ్చింది. ఆమె ఉండటానికి ఎంటలీలోని లొరెటో లో వసతి ఏర్పాటు చేసారు. డార్జిలింగ్ లోనూ ఆమె సిస్టర్‌గానే ఉండేది. ఇక్కడికి రాగానే ఆమె సెంట్ మేరీజ్ స్కూల్లో టీచరుపని చేపట్టింది. ఆ స్కూలు ఆ కాన్వెంటు ఆవరణలోనే ఉండేది.

ఆమె భూగోళ శాస్త్రం తో పాటు చరిత్ర, బైబిల్ వంటి విషయాలను కూడా బోధించేది. తన జీవితంలోని కొన్ని సంఘటనల్ని కూడా తన విద్యార్థులకు చెప్పేది. బెంగాలీ విద్యార్థినులకు బెంగాలీలో చెప్పేది. అందువలన కష్టమైన పాఠాలు కూడా విద్యార్థినులకి ఆసక్తికరంగానూ, సులభంగానూ ఉండేవి.

1931 నుండి 1948 వరకు ఆమె సెంట్ మేరీజ్ లో టీచరుగా పనిచేసింది. 1937 లో ఆమె ఆస్కూలుకు అధ్యక్షురాలయింది.

విద్యార్థినులతోనూ, టీచర్లతోనూ ఆమె చాలా

ఆప్యాయంగా ఉండేది. ఇప్పటికీ ఆమెదగ్గర చదువుకున్నవాళ్ళు, ఆమెతో కలిసిపని చేసిన వాళ్ళు ఆమెని జ్ఞాపకం చేసుకుంటూ ఉంటారు.

సిస్టర్ థెరిసా చేసే ప్రతీపనీ మఠానికి సంబంధించి ఉండేది. ఆమె తనకిచ్చిన పనిని చక్కగా పూర్తిచేసేది.

ఆమె విద్యార్థినులని పరిశుభ్రంగా ఉండమని ప్రోత్సహించేది. స్నానానికి గంటకొట్టి ఆమె స్వయంగా స్నానాలగది ముందు నిలబడి వాళ్ళకి స్నానం చేయించేది. స్నానాలయాక ఆమె వాళ్ళ నోట్లో కొద్ది కొద్దిగా పొటాషియం పర్మాంగనేట్ వేసి పుక్కిలించమనేది.

విద్యార్థినులు అన్నం తినేటప్పుడు, ప్రార్థన చేసేటప్పుడుకూడా ఆమె వాళ్ళతోఉండేది. సాయంత్రం 3 గంటలదాకా ఆమె వాళ్ళకు చదువు చెప్పేది. ఆతరవాత ఆమె ఆఫీసులో పని చూసుకునేది.

బీద పిల్లలు సండే స్కూలులో ఆదివారాలు చదువుకునేవారు. సిస్టర్ థెరిసా వాళ్ళకి కూడా చదువునేర్పేది. అక్కడ ప్రైమరీ (ప్రాథమి దశ) వరకూ చదువు ఉండేది. చదువుకున్నాక పిల్లలు స్నానాలు చేసేవాళ్ళు. ఎవరూ మురికిగా ఉండటానికి వీలులేదు. పిల్లలందరూ చాలా ఉత్సాహంగా అక్కడ చదువుకునే వారు. వాళ్ళకి బహుమతులు కూడా లభించేవి.

అధ్యక్షురాలు అవటంవల్ల సిస్టర్ థెరిసా ఇప్పుడు మదర్ థెరిసా అయింది. ఆమె సన్యాసిని జీవితాన్ని కోరింది. ఆమెకి తనలో భగవంతుడి శక్తి తోచింది. సమాజంలోని అతి పేదవాడిరూపంలో ఆ ఏసుప్రభువే తన సేవలందుకోటానికి

వచ్చాడని ఆమె అనుకుంది.

మదర్ థెరిసాకి కలిగిన అనుభవాలు స్వామి వివేకానందుడికి కలిగిన అనుభవాలు ఒకేలాగా అనిపిస్తాయి. ఇద్దరికీ పేదవారి సేవంటే ఇష్టం. ఇద్దరూ వారిలోనే భగవంతుణ్ణి చూసేవాళ్ళు. ఇద్దరినీ అందరూ చాలా గౌరవించేవారు. పేదవాళ్ళ సేవచేసి వాళ్ళిద్దరూ భగవంతుణ్ణి సేవించుకున్నారు.

ఇది చాలా సులభం, కాని చాలా కష్టంకూడా. బతికున్న దేవుళ్ళు కళ్ళముందే తిరుగుతున్నా, జనం భగవంతుణ్ణి పుణ్యక్షేత్రాల్లో వెతుకుతారు. జీవితమంతా వెతికినా వాళ్ళకి భగవంతుడు దొరకడు. వాళ్ళలాంటి నిర్భాగ్యులు ఈ లోకంలో ఎవరూ ఉండరు. కాని మదర్ థెరిసా జీవితాన్ని చూసి వాళ్ళు నేర్చుకోగలిగితే వాళ్ళకిక నిరాశ అనేది ఉండదు. వాళ్ళు బీదవాళ్ళని ప్రేమించి, వారిసేవ చేసినట్టయితే భగవంతుడు సంతోషిస్తాడు.

## 5. ఈశ్వరాజ్ఞ

ఎంటలీ కాన్వెంటు వాతావరణం శుభ్రంగా ఉంటుంది. చుట్టూ ఎత్తైన ప్రహరీ గోడ లోపల అందమైన గడ్డి పరుచుకు నుంటుంది. పూలచెట్లను కూడా చాలా అందంగా పెంచారు. ఉపాధ్యాయులూ, విద్యార్థులూ ఉండటానికి అది చాలా అనువైన చోటు. కలకత్తాలోనే ఉంటూ నగరంలోని మురికికీ, గోలకీ, పేదరికానికి అది దూరంగానే ఉంటున్నది, నరకం

లోనే స్వర్గంలాగ. కాని నిజంగా అక్కడ అలాగే ఉండేదా?

స్వర్గాన్ని అందరూ వేరువేరుగా ఊహించుకుంటారు. జనం వాళ్ళకి నచ్చిన వాటిల్లో స్వర్గాన్ని చూస్తారు. మానవసేవే మాధవసేవ అనుకునే వారికి, బీదవాళ్ళల్లో దేవుణ్ణి చూసేవాళ్ళకీ, బీదవాళ్ళుండే చోటే స్వర్గంగా కనిపిస్తుంది. గుడిసెల్లోనే బీదవారుంటారు. దిక్కులేని అనాధ బాలలూ, గతిలేని ముసలి వాళ్ళూ ఫుట్‌పాత్‌ల మీద తమ బతుకులు వెళ్ళబుచ్చటం తప్పనిసరి అవుతుంది. మదర్ థెరిసా దృష్టిలో ఫుట్‌పాత్‌లూ, గుడిసెలే స్వర్గాలు. ఎంటలీ కాన్వెంట్ కన్నా గుడిసెలూ, ఫుట్‌పాత్‌లే ఆవిణ్ణి ఎక్కువగా ఆకర్షించేవి.

కాన్వెంటు గోడ బైట మోతీఝిల్ గుడిసెలుండేవి. అక్కడ చాలామంది బీదవాళ్ళుండేవాళ్ళు. వారిలో చాలామందికి రెండుపూట్ల తిండే దొరికేది కాదు. చెయ్యటానికి పనీ దొరికేదికాదు. జబ్బుచేస్తే మందు దొరికేదికాదు. వానవస్తే గుడిసె అంతా కురుస్తుంది. చలికాలంలో బొంతలు, కంబళ్ళులేక అవస్థపడేవాళ్ళు. చిన్నపిల్లలు బట్టలు లేకుండానే తిరిగేవారు. చదువు సంధ్యలంటే ఏమిటో వాళ్ళకేమాత్రం తెలియదు. ఏ పోషణాలేక వాళ్ళు పిచ్చిమొక్కల్లాగ పెరుగుతుండేవాళ్ళు.

గోడ కవతల తోళ్ళ వ్యాపారంకూడా జరిగేది. అక్కడి మురికి, దుర్గంధం భరించరానిదిగా ఉండేది. అక్కడి వాతావరణం చాలా అసహ్యకరంగా ఉండేది. వీటి మధ్యలో, ప్రహరీగోడ లోపల లొరెటో కాన్వెంటు మట్టుకు అతి శుభ్రంగా ఉండేది.



1942-43 లో జనం చాలా బాధలుపడ్డారు. బర్మా నుంచి బియ్యం రావటం ఆగిపోయింది. దేశంలోని రవాణా వ్యవస్థని ఆర్మీ తన ఆధీనం చేసుకుంది. దానితో ఉత్తరభారతదేశం నుంచి నదీమార్గంలో బియ్యం రావటం మానేసింది. గ్రామాల్లోని వాళ్ళు ఇళ్ళూ, భూములూ అమ్ముకున్నా కూడా పస్తులుండవలసి వచ్చింది. వాళ్ళు నగరాలవైపు రాసాగారు. కలకత్తా నగరమంతా బిచ్చగాళ్ళతో నిండిపోయింది. అన్ని వీధుల్లోనూ వాళ్ళే. బెంగాలులో కరువొచ్చింది. అడుక్కునేవాళ్ళకి ఏమీ దొరకటంలేదు.

అన్నం, గంజికూడా దొరక్కుండా పోయింది. కానీ నల్ల బజారులో మట్టుకు జనం బాగా గడించుకున్నారు. ఒకవైపు జనం ఆకలిచావులతో, చస్తుంటే, ఇంకోవేపు లాభాలు చేసుకునేవాళ్ళ జేబులు నిండుతూ పోయాయి. ప్రభుత్వం వేసిన అంచనాలు నమ్మదావున్నా, 20లక్షలమంది చనిపోయారు. నిజానికి మరణించినవారి సంఖ్య ఇంకా ఎన్నోరెట్లు ఎక్కువ.

ఇది ఇలాఉండగాగొడవలు కూడా మొదలయాయి. మహాత్మాగాంధీ నాయకత్వంలో దేశంలో స్వాతంత్ర్యంకోసం ఆందోళన పెద్ద ఎత్తున సాగుతుండగా, మహమ్మద్ జిన్నా నాయకత్వంలో ముస్లిమ్‌లీగ్ కూడా దేశవిభజన కావాలని కోరటం మొదలుపెట్టింది. 1946 ఆగస్టు పదహారున కలకత్తాలో ముస్లిమ్‌లీగ్ సభ జరిగిన తరవాతే అక్కడ గొడవలు ఇంకా ఎక్కువయాయి. పట్టపగలే హత్యలు జరిగాయి. బజార్లోంచి బియ్యం, పప్పు, ఉప్పు, నూనె వగైరా మాయం అయాయి.

అన్ని వేపులా హాహాకారాలు లేచాయి. జనం ఆకలితో అలమటించారు. మదర్ థెరిసా చెవులకి వీళ్ళ ఆర్తనాదాలు వినిపించాయి. తిండిలేక అలమటిస్తున్న పిల్లల్ని ఆవిడ స్వయంగా చూసింది.

కొట్లాటలు జరుగుతున్న సమయంలో సెంట్ మేరీజ్ స్కూలు భవనంలో దిక్కులేని వాళ్ళకి ఉండటానికి చోటు ఇచ్చారు. స్కూలు హాస్టల్లో ఉండే విద్యార్థులని వాళ్ళ ఇళ్ళకి పంపేశారు. అక్కడి సిస్టర్లు నిస్సహాయుల సేవలో మునిగి

పోయారు.

1946 లో జరిగిన కొట్లాటలో దాదాపు 4000 మంది చనిపోయారు. ఆ సమయంలో మదర్ థెరిసా సరుకులు కొనటానికి వీధిలో కొచ్చింది. ఆమె స్కూల్లో దాదాపు 300 మంది పిల్లలు తలదాచుకుని ఉన్నారు. వాళ్ళకు తిండి ఏర్పాట్లు చూడటం అత్యవసరం.

అప్పుడు కొట్లాటలు జోరుగా ఉన్నాయి. ఆవిషయంపట్టించుకోకుండా మదర్ థెరిసా బైటికి వచ్చింది. ఆమెను చూసి గస్తీ తిరుగుతున్న సైనికుల జీప్ ఒకటి ఆమె దగ్గరకొచ్చి ఆగింది. వాళ్ళు ఆమెను స్కూలుకి తిరిగి వెళ్ళిపొమ్మని చెప్పారు. స్కూల్లో 300 మంది పిల్లలు ఆకలితో బాధపడుతూ ఉన్నారని మదర్ థెరిసా చెప్పింది. వాళ్ళకి భోజనం ఏర్పాటు చేయకుండా తను స్కూలుకి పోలేనన్నది.

చివరకి మదర్ థెరిసా గెలిచింది. సైనికులు కొద్దిగా బియ్యం ఇచ్చి ఆమెకు సహాయపడ్డారు.

లోరెటో ఆవరణంలో ఉంటూకూడా మదర్ థెరిసా ఈ కొట్లాటల్లో చనిపోతున్న వారిగురించిన బాధని తప్పించుకోలేక పోయింది. దానికోసం ఆమె ప్రయత్నం కూడా చెయ్యలేదు. ఆమె వాళ్ళకి చాలా దగ్గరగా వెళ్ళాలని అనుకుంది. మదర్‌కి వాళ్ళంటే ప్రేమ కలిగింది. ఆప్రేమ కల్తీలేని ప్రేమ.

వాళ్ళకోసం ఏమైనా చెయ్యాలని మదర్ తహతహలాడి పోయింది. ముఖ్యంగా ఫుట్‌పాత్‌ల మీదున్న అనాధ శిశువులకోసం. మనశ్శాంతి కోసం కాన్వెంటు లోని సిస్టర్లు

ఏటా ఏదో ఒక ఏకాంత ప్రదేశానికి వెళ్తారు. అక్కడ వాళ్ళు ధ్యానమూ, ప్రార్థనలూ చేయవలసి ఉంటుంది. భగవంతుణ్ణి స్మరించుకుంటారు. అటువంటి ప్రశాంతమైన ప్రదేశాలలో డార్జిలింగ్ కూడా ఒకటి. నగరాల్లో ఉండే గోలకి దూరంగా ప్రార్థన చేసుకోవటానికి అనువైన చోటు.

మదర్ థెరిసా రైల్లో డార్జిలింగుకు బైలుదేరింది. కాని ఆమె మనసు కలకత్తాలోనే ఉండిపోయింది. అప్పుడప్పుడు అలాగే జరుగుతుంది. మనకి కూడా ఇల్లువదిలి వెళ్ళేటప్పుడు ఇంటిగురించిన బెంగ కలుగుతూ ఉంటుంది. ఇంట్లో వదిలివచ్చిన పిల్లల గురించో, ప్రియమైన వాళ్ళగురించో ఆలోచిస్తూ ఉంటాం. కొత్త ప్రదేశాలని చూస్తున్నప్పుడుకూడా మనసు ప్రశాంతంగా ఉండదు. మదర్‌కి కూడా అలాగే అనిపించింది. ఆమె డార్జిలింగ్ వచ్చేసింది, కాని ఆమె పిల్లలు. కలకత్తాలోనే ఉండిపోయారు. అనాధలే ఆమె పిల్లలు ఆమె వాళ్ళ గురించే ఆలోచిస్తూ ఉండేది. వాళ్ళ కోసమే మనసులో భగవుంతుణ్ణి ప్రార్థించేది. సెప్టెంబరు 10, 1946 ఈ తేదీ గురించి ఎటువంటి సందేహాలూ లేవు. మదర్ థెరిసా ఆ రోజు రైల్లో ఉంది. ఆమె డార్జిలింగ్ వెళ్తోంది. ఆమె మనసు లోతుల్లో 'భగవంతుడి ఆజ్ఞ' తోచింది. రాబోయే కాలంలో ఆమె ఏదిక్కుగా వెళ్లబోయేదీ కూడా ఆభగవంతుడే ఆమెకి చెప్పాడు. ఆమె చెప్పిన ప్రకారం ఆమెకి ఈశ్వరాజ్ఞ వినిపించింది, '' ఆయన నన్ను లొరెటో బైటకొచ్చి వీధుల్లో తిరిగే బీదవాళ్ళకి సేవచెయ్యమని చెప్పాడు. నాకు ఆయన కోరిక అర్థమైంది. నేను స్వయంగా పేదరికం

అనుభవిస్తూ, నాకన్నా బీదవాళ్ళకి సేవ చేస్తూ భగవంతుడి సేవ చేయాలన్నది ఆయన కోరిక. వాళ్ళని ప్రేమించటం ద్వారా ప్రభువుని ప్రేమించటం నా మార్గం.''

దీన్నే భగవంతుడి నుంచి పొందిన ప్రేరణ అంటారు. ఏదైనా మంచి పని చెయ్యాలని మనసులోంచి పుట్టిన కోరిక. ఆకోరిక కలిగాక మనిషి ఆ పనిని చెయ్యకుండా ఉండలేడు! ఇలాటికోరిక ఎవరికైతే కలుగుతుందో వాళ్ళు ఎంత కష్టమైన పనిని కూడా ఆడుతూ పాడుతూ పూర్తిచేస్తారు. ఇలాంటి వాళ్ళని చూసి మిగతా వాళ్ళు కూడా మంచి పనులు చెయ్యటం నేర్చుకోగలుగుతారు. భయస్తులూ, వెనకబడిన వాళ్లు కూడా ముందుకొచ్చి మంచిపనులలో సహాయం చెయ్యగలుగుతారు. మదర్ థెరిసాకు ఆ రోజు కలిగిన ప్రేరణ వల్లే ఒక గొప్ప మాతృమూర్తిగా, ఎంతో గొప్ప వ్యక్తిగా అయింది. ఆమెతో కలిసిపని చేసిన అదృష్టవంతు లందరూ కష్టమైన పనులను సులభంగా మార్చటం ఎలా అన్న విషయాన్ని నేర్చుకున్నారు.

## 6. ఎదురుచూపు

మదర్ థెరిసా మనసులో భగవంతుడి ఆజ్ఞ తోచినప్పుడు ఆమె వయసు 36 ఏళ్ళు. అప్పుడామె సెంట్ మేరీజ్ స్కూలు ప్రధాన అధ్యాపకురాలు. విద్యార్థినులూ, టీచర్లూ ఆమెని చాలా గౌరవించేవాళ్ళు. అలాంటి పరిస్థితిలో స్కూలు ఉద్యోగం మాని అనాథల సేవకోసం వీధిలోకి రావటం చాలా ప్రమాదకరమైన పని. ఇదికాక ఇంకో విషయంకూడా ఉన్నది.

లొరెటో లో ఉంటునే ఈ పనిని చేపట్టాలని ఆమె అనుకున్నది. దీనికి 'రాథ్‌ఫార్మన్ లొరెటో మదర్ జనరల్ రోమ్' అంటే వాటికన్ కూడా ఒప్పుకోవటం చాలా అవసరం. కలకత్తాలోని ఆర్చ్‌బిషప్ ఈ అనుమతి సంపాదించాలి.

ఈ పనికి చాలా సమయం పడుతుంది. ఇది కాక ఈ విషయంలో తన స్నేహితులతో కూడా సంప్రదించవలసి ఉంది.

డార్జిలింగ్ నుంచి వచ్చాక మదర్ థెరిసా తనకు కలిగిన అనుభూతి విషయం చాలా మంది సిస్టర్లతో చెప్పింది. అదేరోజు ఫాదర్ ఎక్సెమ్‌కి ఉత్తరం కూడా రాసింది. ఫాదర్ ఎక్సెమ్ ఒకప్పుడు మదర్ థెరిసాకి మతాన్ని బోధించిన గురువు, ఆమె మంచిని కోరే వ్యక్తి. ఆయన మదర్‌కి వచ్చిన ఈ ఆలోచనల్ని పొగిడాడు. మదర్, లొరెటో నియమాలని పాటిస్తునే, అనాదలకీ, దుఃఖంలో ఉన్నవారికీ సేవచేయాలనీ, తద్వారా భగవంతుణ్ణి సేవించుకోవాలనీ కోరుతోందని తెలిసి ఆయన చాలా సంతోషించాడు. ఇదికాక మదర్ మనసులో కలిగిన అనుభూతిని ఆయనకూడా ఈశ్వరాజ్ఞ అని నమ్మాడు. ఆమెతనే స్వయంగా వాటికన్ అనుమతి కోరవచ్చని ఆయన అన్నారు. లేకపోతే కలకత్తాలోని ఆర్చ్‌బిషప్, లొరెటో మదర్ జనరల్ ద్వారా అక్కడికి దరఖాస్తు పంపుకోమని అన్నారు. మదర్‌కి క్రమ శిక్షణలో చాలాగురి. అందుకే ఆమె ఆర్చ్‌బిషప్ ద్వారా దరఖాస్తు పంపింది.

మొదట ఆర్చ్‌బిషప్‌కి ఆమె పద్ధతి నచ్చలేదు. ఇన్ని

ఒడిదుడుకుల మధ్య మదర్ యూరోపియన్ స్త్రీఅయి ఉండివీధుల్లోపనిచెయ్యటానికిఆయన ఒప్పుకోలేకపోయాడు. ఆయన మదర్‌కి వెంటనే జవాబివ్వలేదు. కొన్నాళ్ళ తరువాత మదర్ అసన్‌సోల్‌కి బదిలీ అయి వెళ్ళింది. అప్పుడు ఫాదర్ హెన్రీ, ఫాదర్ సేండర్స్‌కి రాసి ఆమెగురించి వాకబు చేశాడు. వాళ్ళలో ఒకరు కలకత్తాలోని సెంట్ థెరిస్సా చర్చిలోనూ, రెండోవారు కర్షియాంగ్ లోని సెంట్ మేరీజ్ చర్చిలోనూ ఉండేవారు. వాళ్ళిద్దరూ కూడా మదర్ కోరిక సబబేనని అన్నారు.

అసన్‌సోల్ కాన్వెంట్‌లో ఆవరణనీ, వంటింటినీ మదర్ పర్యవేక్షించేది. ఇదికాక ఆమె భూగోళశాస్త్రం కూడా బోధించేది. ఆమె తన ఆరోగ్యం కుదుట పరుచుకోటానికి ఆమెని అక్కడికి పంపటం జరిగింది. కాని ఎంటలీలోని లొరెటోలో గొడవలు మొదలయేసరికి ఆమెని వెనక్కి పిలిపించారు.

కలకత్తాలోని ఆర్చ్‌బిషప్ పేరు ఫాదర్ పెరియార్. ఆయన మదర్‌ని లొరెటో బైట ఉండే పనిచెయ్యమని చెప్పారు. రాథ్‌ఫార్మన్ మదర్ జనరల్‌ని లొరెటో సంస్థనుంచి విడిపోవటానికి అనుమతి కోరమని మదర్‌తో చెప్పారు. కాని మదర్ లొరెటోలో ఉంటూనే పనిచెయ్యాలను కున్నది. కాని ఆర్చ్‌బిషప్ పెరియార్ చెప్పినట్లు ఆమె దరఖాస్తు రాసిపంపింది. దానికి జవాబు త్వరగానే వచ్చింది. లొరెటోలో ఉంటూపని చెయ్యటానికి మదర్ థెరిసా రోమ్‌లోని వాటికన్‌కు దరఖాస్తు పెట్టుకోమని మదర్‌జనరల్ రాసింది.

కాని ఈ సారికూడా ఆర్చ్‌బిషప్ పెరియార్ ఆమె రోమ్‌కి దరఖాస్తు పెట్టుకునేటప్పుడు దాన్లో ఆమె లొరెటో బైటనుంచే జనానికి సేవ చేస్తానని రాయమని మదర్‌కి చెప్పారు. మదర్ ఈసారి కూడా ఆయన సలహాని పాటించింది. ఆర్చ్‌బిషప్ తన ఉద్దేశాన్ని కూడా జోడించి ఆదరఖాస్తుని రోమ్‌కి పంపాడు. ఇది ఇలా ఉండగా భారతదేశం రెండు ముక్కలయింది. అటునుంచి హిందూ శరణార్థులు ఉప్పెనలాగ కలకత్తాలో వచ్చి పడసాగారు.

ఒకరోజు రోమ్ లోని వాటికన్ నుంచి జవాబు వచ్చింది. ఇది జూలై 12, 1948 నాటిమాట. కాని ఉత్తరం జూలై ఆఖరికి గాని ఆమెకు అందలేదు. దాని ప్రకారం మదర్ లొరెటో సంఘంలో నన్ (సన్యాసిని) గా ఉంటూ, కాన్వెంట్ బైట తన పనిని తను చేసుకోవచ్చునని అనుమతి దొరికింది. ఒకటే షరతు, మదర్ ఒక సంవత్సరం వరకు కాన్వెంట్ బయటే ఉండాలి. ఏడాది పూర్తయాక ఆర్చ్‌బిషప్ పెరియార్, మదర్ పనిని చూసి, ఆమెని తిరిగి కాన్వెంట్‌లోకి పిలిపించటమా, మానటమా అనేది నిర్ణయిస్తాడు. ఈ కబురు మదర్ కి ఆగస్టు 8, 1948 న ఫాదర్ వేన్ ఎక్సెమ్ ద్వారా అందింది.

మదర్ కాన్వెంట్ వదిలి వెళ్తున్నప్పుడు అక్కడున్న వాళ్ళకి ఆ సంగతి తెలిసింది. ఇంతకుముందే వాళ్ళు ఈ విషయం గురించి కర్ణాకర్ణిగా విని ఉన్నారు. కలకత్తాలోని ధర్మప్రచారకులకి కూడా ఈ విషయం తెలిసింది. ఇదికాక దేశంలోని లొరెటో సంఘాలన్నిటికీ కబురు వెళ్ళింది. వాళ్ళందరికీ మదర్ థెరిసా కోసం ప్రార్థన చేయమని చెప్పారు.

ఇక మదర్ సెలవు తీసుకునే రోజు రానే వచ్చింది. 17 ఆగస్టు, 1948 న ఆమె సెలవు తీసుకుంది. 8 ఆగస్టు 1948 న అనుమతి దొరికిన వెంటనే మదర్ థెరిసా భారత స్త్రీల దుస్తులు ధరించడం మొదలుపెట్టింది. యూరోపియన్ స్త్రీలు ధరించే స్కర్టు మానేసి, ఆమె చవకరకం నీలం అంచున్న తెల్ల చీర కట్టుకోవటం మొదలు పెట్టింది. చీరని స్వీకరించే ముందు ఆమె చర్చిలోని ఫాదరీలనుంచి ఆశీర్వాదం పొందింది. ఆమె చీరలో భుజం దగ్గర ఒక చిన్న శిలువ ఉండేది. చేతిలో జపమాల ఉండేది. ఆమె దగ్గర ఇటువంటివి మూడు ఉండేవి. చాలా రోజులపాటు ఈ కొత్త దుస్తులు వేసుకోటం నేర్చుకుని ఆమె 17 ఆగస్టున కాన్వెంట్ నుంచి సెలవు తీసుకుంది. లొరెటోలోని విద్యార్థినులు బెంగాలీ గీతం పాడి ఆమెకి వీడ్కోలు చెప్పారు. కొన్ని బహుమతులు కూడా ఇచ్చారు. మదర్ ప్రార్థన ముగించి సెలవు తీసుకుంది.

ఆగస్టు 17న మదర్ ఫాదర్ వేన్ ఎక్సెమ్ ఆశీర్వదించి ఇచ్చిన మూడు చీరల్లోనూ ఒక చీర కట్టుకుంది. మదర్ థెరిసాని కొత్తరకం దుస్తుల్లో చూడాలని ఆమె విద్యార్థినులు ఉవ్విళ్ళూరారు. వాళ్ళు ఆమెని ఒక్కసారి చూడాలనుకున్నారు. కాని అది కుదరలేదు. అప్పటికి చీకటిపడింది. ఎంటలీ కాన్వెంట్ నుండి మదర్ బైటికొచ్చింది. తను ఎంచుకున్న మార్గంలో 'బెంగాలీ థెరిసా' ముందుకు సాగింది.

కాన్వెంట్ నుంచి మదర్ వెళ్ళిపోడానికి కొద్దిరోజుల ముందు ఫాదర్ వేన్ ఆమెని సంప్రదించి, ఆమె తల్లికి మదర్

లొరెటో వదిలి వెళ్తున్న విషయం స్కోపియోలోని అర్చసుకి తెలియపరిచాడు. ఆయన ఇంకొక ముఖ్యమైన పని చేశాడు. పూరిగుడిసెల్లోని బీదవాళ్లకి సేవ చెయ్యటానికి కొద్దో గొప్పో వైద్యం తెలియటం అవసరం. అందుకోసం పాట్నా మెడికల్ మిషన్‌లోని సిస్టర్లకి ఉత్తరం రాసి అక్కడ మదర్‌కి ట్రైనింగ్ ఇప్పించే ఏర్పాటు చేశాడు.

## 7. పాట్నాలో మదర్ థెరిసా

డాక్టర్ కోర్సు చదవటానికి మదర్ థెరిసా పాట్నా చేరుకుంది. మెడికల్ మిషన్ సిస్టర్స్ కోవలో ఆమె హోలీ ఫేమిలీ ఆస్పత్రిలో చేరింది.

ఈ మిషన్ సిస్టర్లే ఆ ఆస్పత్రిలో డాక్టర్లుగా ఉండేవారు. అక్కడ ప్రయోగశాలలో పని చేసేవాళ్ళూ, నర్సులు కూడా మిషన్ తాలూకు సిస్టర్లే. మదర్ థెరిసా వీళ్ళతో నాలుగు నెలలు ఉండి పని నేర్చుకుంది.

మనుషులకి సేవ చేయాలంటే వైద్యం తెలియడం చాలా అవసరం. పాట్నాకి వచ్చాక మదర్ ఈ విషయం గ్రహించింది. మదర్‌కి పని నేర్పిన సిస్టర్ - డాక్టర్లలో ఒకరు ప్రసవానికి సంబంధించిన పని చూసే వారైతే, ఇంకొకరు ఆపరేషన్ల పని చూసేవారు. వాళ్ళకి ఊపిరి సలపనంత పని ఉండేది. అయినప్పటికీ వాళ్ళు మదర్‌ని తమకి సహాయకురాలిగా పెట్టుకున్నారు. వాళ్ళకి తరుచు ఆమె సహాయం అవసరమయేది.

మదర్‌కి ఒక మంచమూ, బల్లా, ఏర్పాటు చేశారు. పనిచెయ్యటానికి, విశ్రమించటానికి ఈ రెండూ సరిపోయేవి. ఆమె అక్కడకి పని నేర్చుకోటానికి వెళ్లింది. సరిగ్గా పని నేర్చుకోగలిగితే, ఆమె కోరిక నెరవేరినట్టే.

రోగికి చికిత్స చేసేటప్పుడు డాక్టర్ తోపాటు మదర్‌ని కూడా పిలిపించేవారు. అక్కడికి పసిపిల్లల దగ్గర్నుంచి ముసలివారి వరకూ, అన్ని వయసుల రోగులూ వచ్చేవారు. గాయపడ్డవారినీ, బలహీనంగా ఉన్న రోగుల్ని శ్రద్ధతీసుకుని చూసేవారు. అలాగే కలరా, అమ్మవారు వంటి అంటురోగాలున్న వారిని విడిగా ఉంచి చికిత్స చేసేవారు. ఆమె అందరికీ సమానంగా సేవ చేసేది. పిల్ల పుట్టేటప్పుడు ఎటువంటి సహాయం చెయ్యాలో, సూదిమందు ఎలా ఇవ్వాలో, ఏ జబ్బుకి ఏ మందు ఇవ్వాలో, ఇవన్నీ ఆమె క్షుణ్ణంగా నేర్చుకున్నది. రోగులకి సేవచేస్తూ ఆమె వారికి మరింత దగ్గరైంది.

ఆపరేషన్ దగ్గర్నుంచి మందు చీటి తయారుచేయటంవరకు, రోగుల్ని చూసుకోవటం దగ్గర్నుంచి సూదిమందు ఇవ్వటంవరకూ, అన్ని పనులూ ఆమె ఈ నాలుగు నెలల్లో నేర్చేసుకుంది.

అక్కడ ఉంటూ అక్కడి సిస్టర్ల దగ్గర ఆమె చాలా విషయాలు నేర్చుకుంది. పని నుంచి తీరిక దొరికినప్పుడల్లాఆమెసిస్టర్లతోరకరకాల విషయాలగురించి మాట్లాడేది. ఈ విధంగా ఆమెకున్న అపోహలు కూడా తొలగిపోయాయి. బీదరోగులకి సేవచెయ్యటం కోసం ఆమె

తనుకూడా మంచి ఆహారం తీసుకోవటం, సాయంత్రాలు కాస్త విశ్రమించటం, వారానికి ఒక రోజు సెలవు తీసుకోవటం కూడా అవసరమయేది. మురికి వాడలలోనూ, వీధుల్లోనూ పని చేసేటప్పుడు రోజుకి రెండు పూటలూ స్నానం చెయ్యవలసి వచ్చేది. ప్రతి స్త్రీకి కనీసం మూడు చీరలుండాలి. ఒకటి కట్టుకోటానికీ, ఇంకొకటి ఉతికి ఆరవేయటానికీ, మూడోది ప్రత్యేకమైన అవసరాలకోసం. తలమీద ఎండ పడకుండా కూడా చూసుకోవాలి. దానికి ఏదైనా ఏర్పాటు చూడాలి.

1948 డిసెంబరు మాసం రెండో వారంలో అంటే డిసెంబరు 9న మదర్ కలకత్తాకి తిరిగొచ్చింది. ఆమె లోయర్ సర్క్యులర్ రోడ్ ( ఇప్పుడు ఆచార్య జగదీశ్ చంద్ర బసు రోడ్) లోని 'లిటిల్ సిస్టర్స్ ఆఫ్ ది పూర్ ' వారు నడుపుతున్న కేంద్రానికి చేరుకుంది. ఆ కేంద్రం పేరు 'సెంట్ జోసఫ్స్ హోం'.

# 8. మోతీ ఝిల్ బస్తీలో పని ప్రారంభం

పాట్నానుండి వచ్చాక మదర్ థెరిసా, లోయర్ సర్క్యులర్ రోడ్ లోని 2వ నంబరు భవనంలో దిగింది. ఆభవనం పేరు 'జోసెఫ్స్ హోం' అని ముందే చెప్పటం జరిగింది. ఇక్కడ 'లిటిల్ సిస్టర్స్ ఆఫ్ ఛారిటీ' వారిసంస్థ 'లిటిల్ సిస్టర్స్ ఆఫ్ ది పూర్' ఉండేది. ఒకప్పుడు ఇక్కడి వ్యవహారాలన్నీ ఫాదర్ వేన్ ఎక్సెమ్ చూసుకునేవారు.

ఆ భవనంలో దాదాపు రెండువందల మంది నిస్సహాయులైన ముసలివాళ్ళుండేవాళ్ళు. మదర్ థెరిసా రోజూ కొన్ని గంటల సేపు వారికి సేవ చేసేది. ఈ విధంగా లిటిల్ సిస్టర్స్ సంస్థ చేసేపనుల్లో ఆమె సహాయపడేది. ఆమె తన పని ప్రారంభించటానికి సరైన రోజు ఎన్నుకోటానికి సిద్ధపడింది.

చివరికి 1948 డిసెంబరు 20 తేదీన ఆమె తన కార్యక్రమం ప్రారంభించింది. మదర్ థెరిసా దగ్గర పెట్టుబడికింద ఆర్చ్‌బిషప్ ఇచ్చిన ఐదురూపాయలు మాత్రమే ఉన్నాయి. నీలంరంగు అంచున్న చవకరకం తెల్ల చీర కట్టుకోవటం మొదలు పెట్టింది. ఆమె చీరకి భుజందగ్గర ఒక చిన్న సిలువ ఉండేది. కాళ్ళకి దిట్టమైన చెప్పులు. ఆచెప్పులు పాట్నా వదిలి వస్తున్నప్పుడు ఆమెకి అక్కడి సిస్టర్లు ఇచ్చినవి. ఇప్పుడామె లక్ష్యం మోతీఝీల్ బస్తీ.

మోతీ ఝీల్ అంటే ముత్యాల చెరువు. ఒకప్పుడు అక్కడ ముత్యాలు దొరికేవేమో తెలీదు కానీ ఇప్పుడు అక్కడ అవేం లేవు. కాని అక్కడి చెరువు చాలా పెద్దది. కలకత్తాలో ఉండే మిగతా మురికి వాడల్లా అది కూడా ఒక జన సమ్మర్ధం నివసించే ప్రదేశం. మదర్ థెరిసా పని చేసేరోజుల్లో ఆ ప్రదేశం చాలా అశుభ్రంగా ఉండేది. అక్కడ ఉండే మనుషులకి చదువు సంధ్యలు రావు. ఇదికాక భరించరాని బీదరికం కూడా. రోగాలతోనూ, బీదరికంతోనూ బాధపడుతూ ఉండటం వల్ల వాళ్ళకి ఇట్టే కోపాలు వచ్చేవి. చిన్న చిన్న విషయాలకీ వారు ఒకరితో ఒకరు పోట్లాటలకీ, కొట్లాటలకీ దిగేవారు.

ఎంటలీ కాన్వెంట్ లోని సిస్టర్లు అక్కడికి వెళ్ళేవారు. పారిస్ నుంచి వచ్చిన ఫాదర్ హెన్రీకి కూడా ఆ బస్తీల గురించి బాగా తెలుసు. ఆయన మదర్ థెరిసాకి సహాయపడ్డాడు. అక్కడ ఉండే పిల్లల్లో చాలా మంది సెంట్ థెరిసాలోని పారిస్ స్కూల్లో చదివేవారు. ఆయన మదర్‌కి వాళ్ళ చిరునామాలు కూడా ఇచ్చాడు.

మొదటిరోజే మదర్ పారిస్ స్కూల్లో చదివే ఒక పిల్ల తల్లిదండ్రులని కలిసింది. మోతీఝిల్ బస్తీలో స్కూలు ప్రారంభించాలని ఉందని ఆమె వాళ్ళతో చెప్పింది. ఇదివిని వాళ్ళు మదర్‌ని ప్రోత్సాహించారు. కాని స్కూలు ఎక్కడ నడుపుతుంది? ఏ ఇంట్లో? వాళ్ళ దగ్గర బ్లాక్ బోర్డు అయినా లేదే! స్కూలు పెట్టటానికి కావలసిన హంగులేవీ లేవు. ఇన్ని సాధక బాధకాలున్నా ఆమె మర్నాడే స్కూలు ప్రారంభించాలని తీర్మానించుకుంది.

ఆ రోజు డిసెంబరు 21. ఆరోజే ఆమె అనుకున్న కార్యక్రమం ప్రారంభమైంది. మదర్ పొద్దున్న బస్తీ చేరుకునేటప్పటికే అక్కడ అయిదారుగురు పిల్లలు ఉన్నారు. చెరువు పక్కన చెట్టుకింద కాస్త ఖాళీ చోటుంది. అక్కడ నేలమీద ఒక పుల్లతో గీతలు గీసి పిల్లలు కూర్చునేచోటు గుర్తుపెట్టింది. ఆ తరువాత పాఠం మొదలుపెట్టింది. స్కూలు ప్రారంభమైంది. ఆమె చేపట్టిన కార్యక్రమానికి పునాది పడింది.

'జోసెఫ్స్ హోం' నుంచి మోతీఝిల్ చాలా దూరం. నడిచివెళ్తే దాదాపు గంట పడుతుంది. మదర్ తన భోజనం తనతో తీసుకువెళ్ళేది. మధ్యాహ్నం పన్నెండున్నరకు బస్తీలో

పని ముగించుకుని వెళ్ళేప్పుడు పారిస్ స్కూల్లో భోజనం చేసేది. ఆరోజుల్లో ఆ స్కూలు ప్రధాన అధ్యాపకురాలు సిస్టర్ రొజారియో. 'జోసఫ్స్ హోం' కి మదర్ బస్సులోనో, ట్రాములోనో వెళ్లేది. కాని అప్పుడప్పుడు చిల్లరడబ్బులు బీదవారికి ఇచ్చి వేయటంవల్ల దగ్గర డబ్బుల్లేక నడిచికూడా వెళ్ళవలసి వచ్చేది.

మదర్ థెరిసా స్కూలు ప్రారంభించిందని అందరికీ తెలిసిపోయింది. ఈ వార్త సెంట్ మేరీజ్ స్కూలుకి కూడా చేరింది. ఆమె దగ్గర మునుపు చదువుకున్న విద్యార్థినులు ఆ కొత్త స్కూలు చూడటానికి మోతీఝీల్‌కి వెళ్ళారు. ఇదేం స్కూలు ? అనుకున్నారు వాళ్ళు. ఆకాశం కింద నేలమీద కూర్చుని పాఠం చెప్పే ఆస్త్రీ ఒకప్పుడు వాళ్ళ స్కూలుకి హెడ్ మిస్ట్రెస్‌గా ఉండేది. అంతేకాక ఈవిడ నీలం అంచు చవకరకం చీరకూడా కట్టుకుంది. కాళ్ళకి చెప్పులు, వాళ్ళెప్పుడూ మదర్‌ని ఈ వేషంలో చూడలేదు. వాళ్ళు చాలా ఆశ్చర్యపోయారు. లోపల్లోపల బాధకూడా పడ్డారు.

ఒకసారిఎంటలీలోని లొరెటో ప్రధాన అధ్యాపకురాలు మదర్ ప్రావిన్షియల్‌ని కలిసినప్పుడు ఆమె మదర్ థెరిసాని లొరెటోకి మళ్ళీరమ్మని కోరింది. ఆ కోరిక ఆమె మనసులోనుండి వచ్చినదే. కాని మదర్ థెరిసాకి ఆమె అలా కోరటం నచ్చలేదు. ఆతరువాత ఆమె అటుకేసి వెళ్ళటమే మానేసింది. తన మనసు మారిపోతుందేమోనని ఆమె భయపడింది. ఆమె తను ఎంచుకున్న మార్గం నుండి ఇక మళ్ళదలచుకోలేదు.

పార్క్ స్ట్రీట్ లోని ఫాదరీ మదర్ థెరిసా పనిని మెచ్చుకుని డబ్బిచ్చి ఆమెకు సహాయపడసాగాడు. మొదటిసారి ఆయన వంద రూపాయలిచ్చాడు. ఆడబ్బు దొరికిన ఇరవై నాలుగు గంటల్లోగా మదర్ మోతీఝీల్ బస్తీలో నెలకి ఐదురూపాయల అద్దెకి రెండుగదులు తీసుకుంది. ఇది 27 డిసెంబరున జరిగింది. కానీ ఆగదుల్లో క్లాసులు మొదలు పెట్టే ముందు కొంత మరమ్మతు చేయించవలసిన పని ఉంది. డిసెంబరు 28 నాటికి ఆమె స్కూల్లో పిల్లల సంఖ్య 21 కి పెరిగింది. ఆమె చదువు చెప్పటంతో పాటు వాళ్ళకి పరిశుభ్రంగా ఉండటం కూడా నేర్పేది. ప్రతీ విద్యార్థీ స్నానం చెయ్యాల్సిందే. సెంట్ మేరీజ్ నుంచి ఒక సిస్టర్ కూడా మదర్‌కి సాయపడటానికి అక్కడకి వచ్చింది. జనవరి 4 వ తేదీకి ఇంకో ముగ్గురు సిస్టర్లు వచ్చి చేరారు. అప్పటికి పిల్లల సంఖ్య 56 కి పెరిగింది.

బ్లాక్ బోర్డు లేనందున మట్టిలోనే రాసి పిల్లలకి అక్షరాలు నేర్పించేవాళ్ళు. స్కూలుకి పరిశుభ్రంగా వచ్చే పిల్లలకి సబ్బు బిళ్ళలు బహుమానంగా దొరికేవి.

జనవరి 15 కల్లా కొత్త ఇంట్లో స్కూలు ప్రారంభమయింది. స్కూలుకి 'నిర్మల్ హృదయ్' అని పేరు పెట్టారు. ఫాదర్ నికెయిస్ శుభాకాంక్షలు తెలపటానికి స్వయంగా అక్కడకి వచ్చారు.

మోతీఝీల్ బస్తీలోని జనం ఎప్పుడూ జబ్బులతో బాధపడుతూ ఉండేవారు. వారి సేవ చేస్తూ మదర్ ఎప్పుడూ వాళ్ళ దగ్గరే ఉండేది. క్షయ, కుష్టురోగాలతో బాధపడే వాళ్ళకి సేవ చెయ్యటానికి కూడా ఆమె వెనుకాడేది కాదు.

రోగులకి వైద్యం చెయ్యటానికి ఒక మందుల షాపు ఆ బస్తీలో పెట్టాలని అనుకున్నారు. కాని అక్కడ పెట్టటం వీలుకాక, పారిస్ స్కూల్లో పెట్టారు. క్షయరోగుల్ని ఎక్స్‌రే తియ్యటానికి ఒక మిషన్ కూడా దొరికింది. స్కూలు హెడ్ మిస్ట్రెస్ సిస్టర్ రొజారియో వాళ్ళకి విడిగా ఒకగది ఇచ్చింది. అక్కడ రోగులు గుంపులుగా కూడేవారు. అక్కడ బీదవారికి ఆసుపత్రి తెరవగానే చాలా సంతోషం కలిగింది.

మోతీఝీల్ తరువాత మదర్ థెరిసా తిల్‌జలా బస్తీలో కూడా ఒకస్కూలు తెరవాలని అనుకుంది. అక్కడి పిల్లల పరిస్థితి మోతీఝీల్ లో ఉన్న పిల్లలకన్నా అధ్వాన్నంగా ఉంది. మోతీఝీల్ లో స్కూలు తెరిచినా తిల్‌జలా లోని పిల్లలు అక్కడ చదువుకోవటం వీలుకాదు. అందువల్ల మదర్ తిల్‌జలాలో కూడా స్కూలు తెరవాలని నిర్ణయించుకుంది.

మదర్ తిల్‌జలాకి వెళ్ళి అక్కడ ఉన్నవాళ్ళతో తన ఉద్దేశం చెప్పింది. మొత్తం ఆరుగురితో ఆస్కూలు ప్రారంభమయింది. ఇంకో ఆరుగురు కుర్రవాళ్ళు ఉన్నారు. కాని వాళ్ళు అల్లరివాళ్ళూ, బద్ధకస్తులూ అవడంతో స్కూలుకి వచ్చేవారు కారు. అక్కడ ఆమెకి ఒక చిన్న ఇల్లు దొరికింది. ఆ ఇల్లు ఒక ముసలావిడది. ఆమె ఆ ఇంటికి నెలకి ఐదు రూపాయల అద్దెచెప్పింది. అందుకే మదర్ దాన్ని వదలి ఇంకో ఇల్లు నెలకి నాలుగురూపాయల అద్దెకి తీసుకుంది. ఆ ఇంట్లో మందుల కొట్టు పెట్టి, బైట పిల్లలకి పాఠాలు చెప్పటం మొదలుపెట్టింది.

ఫిబ్రవరి 2 వ తారీకునాటికి తిల్‌జలా స్కూల్లోని పిల్లల సంఖ్య 23 కి పెరిగింది. అక్కడి పిల్లల్ని చూసి మదర్ చాలా

ఆనందించింది. వాళ్ళ ప్రవర్తన బావుండేది. ఆ స్కూలుకి కూడా 'నిర్మల్ హృదయ్' అనే పేరే పెట్టారు.

చదువుతోపాటు అక్కడ వైద్య సదుపాయం కూడా ఉండేది. ఈ విధంగా మదర్ మోతీఝీల్, తిల్‌జలాలోని బీదవారికి చాలా సహాయపడింది. మొదటినుంచీ కూడా ఆమె స్వేచ్ఛను కోరేది. ప్రభుత్వంనుంచీ, చర్చినుంచీ సహాయం కోరితే బహుశా వాళ్ళు పెట్టే షరతులు ఒప్పుకోవలసి వచ్చేది. దీనివల్ల ఆమె తనకు నచ్చిన విధంగా పని చెయ్యటం వీలుపడి ఉండేది కాదు. అందుకే ఆమె ఎటువంటి సహాయమూ



కోరలేదు. ఏ షరతులూ లేకుండా ఎవరైనా సహాయం చేస్తామంటే ఆమె ఆనందంగా ఒప్పుకొనేది.

ఇతరులనుంచి సహాయం పొందేప్పుడు ఆమెకి కొన్ని మంచి అనుభవాలతో పాటు కొన్ని చేదు అనుభవాలు కూడా ఎదుర్కోవలసి వచ్చింది. ఆమె 'పార్క్ స్ట్రీట్' లోని ఫాదర్ దగ్గరకెళ్ళినప్పుడు ఆయన చేసిన అనవసర ప్రసంగం వినవలసి వచ్చింది. పారిస్‌లోని ప్రధాన మతాధికారిని కలిస్తే మదర్ చేపట్టిన పనులకయే ఖర్చు ఆయన ఇస్తాడని ఫాదరీ ఆమెకి సలహా ఇచ్చాడు. మదర్ ఈలాగ నలుగుర్నీ యాచించి సంస్థ నడపవచ్చున్న విషయాన్ని ఆయన నమ్మలేదు. ఆయన మదర్‌తో సరిగ్గా ప్రవర్తించలేదు.

ఆమెకి ఇంకోరకం అనుభవం కూడా కలిగింది. ఒకరోజు మధ్యాహ్నం ఆమె ఒక కాన్వెంటులోకెళ్ళి ఒంటరిగా కూర్చుని భోజనం చెయ్యటానికి తగిన చోటు వెతుక్కోసాగింది. అక్కడి వాళ్ళు ఆమెని గుర్తు పట్టలేదు. ఆమెని బిచ్చగత్తె అనుకుని స్కూలు వెనకవైపువున్న మెట్ల కింద చోటు చూపించారు.

ఆర్చ్‌బిషప్ సలహా ప్రకారం మదర్ థెరిసా ఒక నోటు పుస్తకంలో రోజు తను చేసిన పనుల వివరాలు రాసుకునేది. కొందరు ఈ పుస్తకాన్ని డైరీ అని కూడా అనేవారు. కానీ అది డైరీ కాదు. ఆర్చ్‌బిషప్ చూడటంకోసం ఆమె తను రోజూ చేసే పనుల జాబితా దానిలో రాసి వుంచేది. ఆ పుస్తకం చూస్తే ఒకటి నుంచి మొదలు పెట్టి కోట్ల వరకూ ఎంత సులభంగా వెళ్ళవచ్చో తెలుస్తుంది.

# 9. క్రిక్ లేన్ లో గడిపిన రోజులు

మదర్ థెరిసా తనంతటతానే 1948లో భారతదేశపు పౌరసత్వం తీసుకుంది. భారతదేశమే తన దేశంగా ఆమె ఎంచుకుంది. ఆమె ఈ దేశంలోని నిస్సహాయ ప్రజలకీ, బీదవారికీ, సేవచేస్తూ దేవుణ్ణి సేవించుకుందామని అనుకుంది.

లోయర్ సర్క్యులర్ రోడ్‌లోని 2వ నంబరు ఇంట్లో ఆమె తనపని ప్రారంభించింది. ఆ ఇంటిపేరు, 'సెంట్ జోసఫ్ హోమ్: అక్కడ రోజు రోజుకీ దిక్కులేని వారి సంఖ్య పెరిగి పోవటంతో ఆమె ఇంకో ఇంటి కోసం వెతకటం మొదలుపెట్టింది. ఈ పనిలో ఫాదర్ వేన్ ఎక్సెమ్ ఆమెకి సహాయం చేశాడు.

ఫాదర్‌వేన్‌ఎక్సెమ్ ఆఫీసులో ఆల్ఫ్రెడ్ నోమెజ్ అనే ఆయన పని చేస్తూ ఉండేవాడు. ఆయన క్రిక్ లేన్ లోని 14వ నంబరు ఇంట్లో ఉండేవాడు. ఆయునది మూడంతస్తుల మేడ. అన్నిటికన్నా పై అంతస్థు ఖాళీగా ఉండేది.

ఆ ఇంట్లో ఆల్ఫ్రెడ్ తన సోదరుడు మైకేల్ తో కలిసి ఉండేవాడు. ఆయున మిగతా సోదరులిద్దరూ తూర్పు పాకిస్తాన్ లో ఉండేవారు. సోదరుల అనుమతితో అల్ఫ్రెడ్ మూడో అంతస్థులోని ఒకగదిని మదర్ థెరిసాకి ఇచ్చాడు.

ఫిబ్రవరి 28వ తేదీ 1953. మదర్ క్రిక్‌లేన్ లోని ఈ ఇంట్లో ప్రవేశించింది. ఆమె తనతో ఒక నల్లరంగు పెట్టె తీసుకొచ్చింది. ఆమెతో బాటు ఒక వితంతువు, చారు వాళ్ళమ్మకూడ వచ్చింది. ఆమె సెంట్ మెరీజ్ స్కూల్లో వంట చేసేది. ఆమెకి మదర్ అంటే చాలా ఇష్టం.

గోమెజ్ సోదరులు మదర్ కి పనికొచ్చే సామానులు ఇవ్వాలను కున్నారు. కాని ఆమె వాళ్ళ దగ్గర్నుంచి రెండుమూడు పేకింగ్ కేసులు మాత్రమే కూర్చోటానికి పనికొస్తాయని, తీసుకుంది. ఒక సారి వేన్ఎక్సెమ్ మదర్ కి మేరీ మాత చిత్రం బహూకరించాడు. దానిని ఆమె గోడకు తగిలించింది.



మదర్ థెరిసా 'నన్' అయి సన్యాసం పుచ్చుకోవడం వల్ల, మురికివాడల్లోనూ ఫుట్‌పాత్‌ల మీద పనికి వెళ్ళేటప్పుడు ఇంకో ఆడమనిషిని తీసుకు వెళ్ళాలన్నది వాళ్ళ నియమం. మైకెల్ గోమెజ్ ఎనిమిదేళ్ళ కూతురు మేబేల్ ఎప్పుడూ మదర్ తోటే ఉండేది. అప్పుడప్పుడు మదర్‌తో మైకిల్ భార్యకానీ, మేనకోడలుకానీ వెళ్ళేవారు. మేబేల్ ప్రస్తుతం ఆమెరికాలో ఉంటున్నది.

ఒకరోజు ఏం జరిగిందంటే, మదర్ తనపని చూసుకుని పన్నెండు గంటలకల్లా ఇంటికి చేరవలసింది. కాని రెండు గంటలవుతున్నా ఆమె రాలేదు. మైకెల్ చిన్న కూతురు మేబేల్ ఆమెతో వెళ్ళింది. బైట జోరున వాన కురుస్తోంది. చివరికి రెండు గంటల ప్రాంతాల్లో వాళ్ళిద్దరూ తడుస్తూ రిక్షాలో ఇల్లు చేరారు. ఎందుకింత ఆలస్యం అయింది ? మోతీఝీల్‌లో ఒకామె ఇంటి అద్దె కట్టలేక పోయిందట. ఆమెచేత ఇల్లు ఖాళీ చేయించటం కోసం ఇల్లు గలాయన ఇంటి కప్పుతొలగించాడట. ఈ విషయం మదర్‌కి తెలిసింది. నెలకి నాలుగురూపాయల చొప్పున, రెణ్ణెల్ల అద్దె ఎనిమిది రూపాయలు ఆ స్త్రీ చెల్లించవలసి ఉంది. ఆమె ఒడిలో ఒక పసిపిల్లవాడు కూడా ఉన్నాడు. ఆమె తనతలమీద ఒక గిన్నె బోర్లించుకుని తడవకుండా ఉండాలని ప్రయత్నిస్తోంది. ఆ పిల్లవాడి ఒళ్ళు జ్వరంతో కాలిపోతోంది. ఈమెకు సహాయం చెయ్యటంలో వాళ్ళు ఇంటికి రావటం ఆలస్యమైంది. మేబేల్‌ని ఇంట్లోవదిలి, మదర్ మళ్ళీ ఆ స్త్రీ కి పిల్లవాడికీ సహాయపడటానికి వెళ్ళింది. వాళ్ళ కష్టాలను గట్టెక్కించింది.

మురికివాడలో పనిచేయటానికి మందులూ పరికరాలూ ఉండాలి. మైకెల్ గోమెజ్‌ని తీసుకుని మదర్ మందులకంపెనీలకి వెళ్ళేది. సహాయపడటం ఇష్టంలేని వాళ్ళదగ్గర్నుంచికూడాఆమె మందులు సేకరించగలిగింది. ఒక రోజు ట్రామ్‌లో వెళ్తూ ఆమె ఒకతను చెట్టుకింద వానలో తడుస్తూ పడుకుని ఉండటం చూసింది. వెనక్కి వస్తున్నప్పుడు అతని గురించి వాకబుచేస్తే, అతను చనిపోయాడని తెలిసింది. మదర్ చాలా బాధపడింది. అలా దిక్కులేని చావులు చచ్చేవారి కోసమే ఆమె తరువాత కాళీఘాట్‌లో 'నిర్మల్ హృదయ్' ని స్థాపించింది.

1949 మార్చి 19, ఒకమ్మాయి మదర్ థెరిసాని కలవటానికి క్రిక్‌లేన్ లోని ఇంటికి వచ్చింది. ఆమెపేరు సుభాషిణీ దాస్. ఆమె సెంట్ మేరీజ్ స్కూల్లో విద్యార్థిని. ఆమె ఏడవక్లాసు నుంచీ మదర్ దగ్గర చదువుకుంటోంది. ఆమె అంటే మదర్‌కి చాలా ఇష్టం. ఆపిల్లది డబ్బున్న కుటుంబం.

ఆపిల్లే 'మిషనరీ జ్ ఆఫ్ ఛారిటీ' లో మొట్ట మొదటి సిస్టర్‌గా చేరింది. తన కుటుంబాన్ని వదలి కష్టాల్లో ఉన్నవాళ్ళకి సేవ చెయ్యటానికని, మదర్‌కి సహాయపడటానికని వచ్చింది. ఆమె పేరు సిస్టర్ ఏగ్నెస్ అనిమార్చారు. మదర్ థెరిసా మొదటి పేరు కూడా అదే. ఆపిల్ల మదర్ పేరుని బహుమతిగా అడిగి తీసుకుంది. ఆమె టీచర్స్ ట్రైనింగు పూర్తి చేసి అక్కడికి వచ్చింది.

కొన్ని వారాల తర్వాత ఇంకో అమ్మాయి కూడా వచ్చి

చేరింది. ఆమె పేరు మెగ్దాలీనా గోమేజ్. ఆమె కూడా సెంట్ మేరీజ్‌లో చదివేది. ఒకప్పుడు ఆమెకూడా మదర్ శిష్యురాలే ! ఆమె తల్లిదండ్రులు ముందు ఆమెని ఆపటానికి ప్రయత్నించారు. ఆ తరువాత 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' లో చేరాలన్న ఆమె కోరికను అంగీకరించారు. ఆమె ఆ సంస్థలో చేరిన రెండో సిస్టర్. ఆమె తన పేరు సిస్టర్ గెర్ట్రూడ్ గా మార్చుకుంది. ఆతరువాత డాక్టరు కూడా అయింది.

ఆతరువాత సిస్టర్ డొరోథీ, సిస్టర్ మార్గరెట్ మేరీ కూడా ఇదే విధంగా చేరారు.

మదర్‌తో పాటు సిస్టర్స్ సంఖ్య ఐదు. వాళ్ళు ఇంటింటికీ వెళ్ళి మిగిలిపోయిన వంటకాలను అడిగితెచ్చుకునేవారు. దాన్ని బీదవారికి తినడానికి పెట్టేవారు. ఈ పనులతోబాటు సిస్టర్ల చదువుకూడా సాగుతూ ఉండేట్టు మదర్ చూసుకునేది. రోజూ సాయంత్రం ఆమె స్వయంగా వాళ్ళకి చదువు చెప్పేది.

నెమ్మది నెమ్మదిగా సిస్టర్ల సంఖ్య పెరిగింది. కొన్ని నెలల్లోనే ఈ సంఖ్య పదికి చేరింది. 2వ సిస్టర్‌కి అమ్మవారు పోకగానే మదర్ ఆ అంతస్తులోని ఇంకో గది అడిగి తీసుకుంది. మెల్ల మెల్లగా మూడో అంతస్తు పూర్తిగా ఆమె ఉపయోగించుకో సాగింది. అప్పటికీ చోటు సరిపోకపోయేటప్పటికి డాబామీద ఇంకొకగది కట్టించుకుంది.

వాళ్ళు తమ సమయాన్ని విభజించుకుని పని చేసేవారు. గంటలు కొడుతూ ఏ సమయంలో ఏం చెయ్యాలో నిర్ణయించుకుని ఒక పద్ధతి ప్రకారం పనులు చేసేవారు.

'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' కి అప్పటికింకా పేరు రాలేదు. ఆ సంస్థ నియమాలూ అవీ కూడా నిర్ధారింప బడలేదు. కలకత్తాలోని ఆర్చ్‌బిషప్ మదర్ థెరిసా సంస్థ చేసే పనులను గమనిస్తూ ఉండేవాడు. ఆయన ఆ సంస్థ నియమాలను నిర్ణయించే బాధ్యత వేన్ ఎక్స్‌మ్ పైన పెట్టాడు. ఆ నియమాలని ఐదు కాపీలు తియ్యమని చెప్పాడు. వాటిని ఆయన ఏప్రిల్‌లో రోముకి తీసుకు వెళతానన్నాడు. ఇది 1950 లో జరిగిన విషయం. ఈ విషయంలో కేథ్‌లిక్ మత విభాగం అధ్యక్షుడు కార్డినల్ ఆమోదం సంపాదించవలసి ఉంది.

1950 అక్టోబరు 7వ తేదీన రోములోని 'సేక్రెడ్ కాంగ్రెగేషన్' మదర్ థెరిసా సంస్థకి సంబంధించిన నియమాలని ఒప్పుకుంది. పోప్, కేథలిక్ చర్చికి చెందిన ముఖ్యులూ, 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' సంస్థని ఆమోదించినట్టు ప్రకటించారు. ఆరోజు నుంచే సిస్టర్ థెరిసా, మదర్ థెరిసాగా మారింది. 1937 లోనే సెంట్ మేరీజ్ స్కూలు అధ్యక్షురాలిగా నియమించబడ్డప్పుడే విద్యార్థులు ఆమెని 'మదర్' అని పిలిచేవారు. కాని అది వేరే సంగతి.

చూస్తూండగానే 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' సిస్టర్ల సంఖ్య పెరిగిపోయింది. రేండేళ్ళలో ఈ సంఖ్య 28-30 కి చేరుకుంది.

# 10. తన భవనం 'మదర్ హౌస్' లో

'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' కి ఇప్పుడు ఒక పెద్ద ఇల్లు కావలసి వచ్చింది. అది కొత్తదైనా, పాతదైనా పరవాలేదు. ఫాస్టర్ హెన్రీకి, ఫాస్టర్ ఎక్సెమ్‌కీ మదర్ చేస్తున్న సేవగురించి తెలుసు. వాళ్ళిద్దరూ ఇంటి కోసం వెతకసాగారు.

ఇండియా విభజన జరిగి స్వాతంత్ర్యం వచ్చాక కూడా అప్పుడప్పుడూ హిందూముస్లిమ్ కలహాలు జరుగుతునే ఉండేవి. వీటివల్ల తూర్పు పాకిస్తాన్‌లోని హిందువులు ఇక్కడికి రావటం, బెంగాల్‌లోని ముస్లిమ్‌లు అక్కడికి వెళ్ళటం జరుగుతూ ఉండేది. ఇటువంటి వారిలో ఒకరు డాక్టర్ ఇస్లామ్. ఆయనకి మతం అంటే చాలా శ్రద్ధ. ఆయన డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేట్ గా ఉండేవారు. ఫాస్టర్ వేన్ ఎక్సెమ్ కి ఆయనతో పరిచయం ఉండేది. ఆయన 54-ఏ, లోయర్ సర్క్యులర్ రోడ్‌లో ఉండేవాడు. ఆరోడ్డుకి ఇప్పుడు జగదీశ్‌చంద్ర బసు రోడ్డని పేరు పెట్టారు. ఆయన తన ఇంటిని మదర్ థెరిసాకి అమ్మటానికి ఒప్పుకున్నాడు.

ఒకరోజు వాళ్ళిద్దరూ ఇంటిముందు వీధిలో నిలబడి మాట్లాడుకుంటున్నారు. ఇంతలో డాక్టర్ ఇస్లామ్ ఫాస్టర్ వేన్ ఎక్సెమ్‌ని కాస్సేపు తన కోసం వేచి ఉండమని కోరాడు. ఆయన నమాజ్‌కి వేళయింది. దగ్గర్లోని మసీదులో నమాజ్

చేసుకోటానికి ఆయన వెళ్ళిపోయాడు. అక్కణ్ణించి వచ్చాక ఆయన గంభీరంగా అయి, ఒ రోజు అల్లా నాకీ ఇల్లిచ్చాడు, ఇవాళ ఆయనకే ఈ ఇంటిని అప్పగిస్తున్నాను, అన్నాడు.

ఆ ఇల్లు మదర్ థెరిసాకి కూడా నచ్చింది. చాలా తక్కువ ధరకి డాక్టర్ ఇస్లామ్ తన ఇంటిని ఆర్చ్‌బిషప్ కి అమ్మాడు.

1953 ఫిబ్రవరిలో 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' సిస్టర్లు ఆ ఇంట్లో ప్రవేశించారు. ఇప్పుడు వారి కొత్త చిరునామా 54 – ఏ' లోయర్ సర్క్యులర్ రోడ్. ఆ ఇంటికి 'మదర్ హౌస్' అని పేరు పెట్టారు. అదే 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' వారి కేంద్రంగా మారింది.

ఈ ఇల్లు నాలుగంతస్తులమేడ. ఇంటిపై కప్పుమీద మేరీ మాత ప్రతిమ ఉంది. అది తెల్ల రాతితో చేసిన బొమ్మ. ఇంటి ముఖద్వారం ఒక సందులోకి ఉంది. కాలింగ్ బెల్‌కి బదులు తలుపుకి ఒక గొలుసు ఉంది. దానిని పట్టి లాగితే లోపల గంట మోగుతుంది. సిస్టర్ తలుపు తీస్తుంది. లోపల కెళ్ళగానే కూర్చోటానికి ఒక గదిలో కొన్ని కుర్చీలు, ఒక బల్లా, ఒక బెంచీ ఉన్నాయి. గోడకి చిత్రపటాలున్నాయి. 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' వాళ్ళ కార్యక్రమానికి సంబంధించిన ఒక ఛార్టు కూడా తగిలించి ఉంది.

ఈ గది తరువాతే పెరడు ఉంది. అక్కడ సిస్టర్లు బట్టలు తకటం, గిన్నెలు కడగటం వంటి పనులు చేస్తారు. ప్రార్థన చెయ్యటానికి విడిగా ఒక గది ఉంది. అక్కడ నేలమీద ఒక తివాసీ పరచి ఉంటుంది. అక్కడ మోకాళ్ళమీద కూర్చుని ప్రార్థన చెయ్యాలి. అక్కడ ఒక బల్లమీద మేరీ ప్రతిమ ఉంది.

ఉదయం ప్రార్థన అయిన తరువాత ఎనిమిది గంటలకి రొట్టె లూ, టీ ఉపాహారంగా సేవిస్తారు. ఆ తరువాత సిస్టర్లు వాళ్ళ పనుల్లోకి ఎవరిదారిన వాళ్ళు వెళ్తారు. వాళ్ళు ఇద్దరిద్దరూ జట్టుగా వెళ్తారు. బైట దొరికే ఆహారం వాళ్ళు తినరు. చివరికి టీ, మంచినీళ్ళు కూడా తీసుకోరు. వాళ్ళు తమతో తాగేనీళ్ల సీసా తీసుకెళ్తారు. సిస్టర్లకి నీలం అంచున్న చవకరకం తెల్ల చీరలు మూడు ఇస్తారు. పమిట కొంగుకి భుజం దగ్గర పిన్నుతో పెట్టుకోటానికి సిలువ మీదున్న చిన్న ఏసుక్రీస్తు బొమ్మ ఇస్తారు. ఇది లోహంతో చేసిన బొమ్మ. జపమాల కూడా ఇస్తారు. ఇవికాక ఒక కంచమూ, పలచటి పరుపూ ఇస్తారు. వాళ్ళు పడుకునే గదిలో పంఖాలు ఉండవు. బైటనించి వచ్చేవాళ్ళు కూర్చునే గదిలో మటుకే ఒక పంఖా ఉంటుంది.

అందరు సిస్టర్లూ ఉదయం ఎనిమిది గంటలకల్లా పనిలోకి వెళ్ళి సరిగ్గా పన్నెండు గంటలకి మదర్ హౌస్‌కి వాపసు వస్తారు. అక్కడ మధ్యాన్నం బోజనం చేస్తారు. ఆ తరువాత కాస్త విశ్రాంతి తీసుకుని మళ్ళీ 2 గంటలకి బైటకి వెళ్ళిపోతారు. సాయంత్రం ఆరుగంటలకి ఇంటికొచ్చి ఒకగంట దేవుణ్ని ప్రార్థిస్తారు. రాత్రి భోజనం అయాక అరగంట సేపు ప్రార్థన చేస్తారు. రాత్రి పది గంటల కల్లా అందరూ నిద్రపోయి తీరాలి. మదర్ థెరిసా మటుకూ రాత్రి మేలుకుని రాసు కుంటుంది.

ఆవిణ్ణి కలవటానికి అక్కడికి వచ్చేవాళ్ళకి ఆవిడ ఒక పరిచయ పత్రం ఇచ్చేది. అందులో ఈ క్రింది విధంగా రాసి ఉండేది –

మౌనం యొక్క ఫలితం ప్రార్థన
ప్రార్థన యొక్క ఫలితం నమ్మకం
నమ్మకం యొక్క ఫలితం ప్రేమ
ప్రేమ యొక్క ఫలితం సేవ
సేవ యొక్క ఫలితం శాంతి.

– మదర్ థెరిసా

గురువారం సిస్టర్లకి సెలవ. ఆరోజు సిస్టర్ల కింద శిక్షణ పొందే స్త్రీలు వాళ్ళ పనులు చేస్తారు. శరీరంలోనూ, మనసు లోనూ ఉత్సాహం, మంచి పనులు నేర్చుకోవాలన్న ఉబలాటం, తెలివితేటలు, చురుకుతనం ఉన్న ఆడపిల్లలు ఎవరైనా శిక్షణ పొందటానికి తగిన వారే. శిక్షణ కాలం రెండేళ్ళలో మొదటి ఆరునెలలూ మతానికి సంబంధించిన 'అ, ఆ, 'లు – అంటే ప్రాథమిక విషయాలు నేర్పుతారు. దీన్ని 'ఎస్పిరెన్సీ' అంటారు. ఆ తరువాత సంవత్సరం పాటు పొందే శిక్షణని 'పోస్ట్యులెన్సీ' అంటారు. ఆతరువాత శిక్షణ ఇంకా రెండేళ్ళు ఉంటుంది. దాన్ని 'నొవిషియెట్' అంటారు. ఆతరువాత ప్రమాణం చేసి శిక్షణ పొందిన స్త్రీ 'ప్రొఫెస్ట్ సిస్టర్' అవుతుంది. ఆతరువాత 'జూనియేటర్'. ఆ సమయంలో ప్రతియేడూ ప్రమాణం చెయ్యవలసి ఉంటుంది. ఈ విధంగా అయిదేళ్ళు చెయ్యాలి. ఆతరువాత 'టర్షియన్‌షిప్' ఉంటుంది. చివరిగా మనస్ఫూర్తిగా ప్రమాణం చెయ్యవలసి ఉంటుంది. ఈ విధంగా ఈ శిక్షణ సమయం తొమ్మిదేళ్ళుంటుంది.

ఛార్ట్ ప్రకారం సిస్టర్లు నాలుగు రకాల పనులు చెయ్యాలి – సాంఘిక సేవ, వైద్యం, చదువుచెప్పటం, మతపరమైన

పనులు, పిల్లల్ని చూసుకోటం, ఆకలితో ఉన్నవారికి తిండిపెట్టటం, ఫుట్‌పాత్‌ల మీద ఉండేవారికి రాత్రిళ్ళు పడుకునేందుకు చోటివ్వటం మొదలైనవి సాంఘిక సేవకింద వస్తాయి. మందుల షాపులు నడపటం, కుష్ఠురోగుల సేవ, అనాధలైన వికలాంగులకి సేవ చెయ్యటం, చావు బతుకుల్లో ఉన్నవాళ్ళకి, ఎయిడ్స్ రోగులకీ ఉండటానికి వసతి కల్పించటం వంటివి వైద్యానికి సంబంధించిన సేవ. స్కూలు నడపటం, చేతిపనులు నేర్పటం, కుట్టుపనీ, టైపు-షార్ట్‌హేండ్ నేర్పటం – చదువు చెప్పటం కింద వస్తాయి. మత సంబంధమైన పనుల్లో – జైళ్ళకి వెళ్ళటం, బీదకుటుంబాల ఆచూకీ తెలుసుకోటం, సండే స్కూలు నడపటం వంటివి వస్తాయి.

మదర్ థెరిసా దానాలు తీసుకునేది, కాని చందాలు తీసుకునేదికాదు. ఆమె ప్రభుత్వం దగ్గర్నుంచి కానీ చర్చినుంచి కానీ నెలసరి ఖర్చుకి డబ్బు తీసుకునేది కాదు.

సిస్టర్లుకూడా అన్ని మతాల పిల్లల్నీ ఒకే రకంగా చూసేవారు.

## 11. ప్రేమ యొక్క అనేకరూపాలు

**నిర్మలా శిశు భవనం :** ఈ ఇల్లు పేరు నిర్మలాభవనం. ఈ ఇల్లు ఎంటాలీ మార్కెట్టుకి ఎదురుగానున్న ఆచార్య జగదీశ్ చంద్ర బసు రోడ్డులో ఉన్నది.

కన్యలకి పుట్టిన పిల్లలు సమాజంలో అవమానం పొందుతారు. సమాజం వాళ్ళని చేరదీయదు. వారిపై ప్రేమ

చూపదు. వేశ్యలు కూడా కోరకుండానే గర్భవతులవుతారు. వాళ్ళకి పిల్లలు పుడితే వాళ్ళుకూడా ఎవరి ప్రేమకీ నోచుకోరు. తల్లిదండ్రులు చనిపోతే ఆపిల్లలని సమాజం పట్టించుకోదు. ఇంతేకాక అలాటిపిల్లలకి ఏదైనా చెడు జబ్బువస్తే ఎవరూ వారిని తాకటానికికూడా ఇష్టపడరు. తమ ఇంటి గుమ్మంలో నిలుచున్నా భరించలేరు.

చాలా మంది పిల్లలు మూగ, చెముడు, అంగవైకల్యంతో పుడతారు. వాళ్ళ పరిస్థితి అందరికన్నా ఘోరంగా ఉంటుంది. వాళ్ళ జబ్బుకి కారణం వాళ్ళ వెన్నెముకే. ఈ జబ్బుని మల్టిపల్ సంక్లోరోమిస్ అంటారు. జబ్బులాగే దీనిపేరుకూడా వంకరగా ఉంటుంది. మామూలుగా ఇలాంటి పిల్లలు ఎక్కువకాలం బతకరు.

ఇలాంటి పిల్లలు వీధిపక్కన పారేసిన చెత్తలాగ పడి ఉంటారు. ఆకలి, రోగం, దిక్కులేక పడి ఉండటంవల్ల వాళ్ళు చిన్న తనంలోనే చనిపోతారు.

పువ్వులకీ, మొక్కలకీ సరైన సమయంలో పోషణ ఇస్తే, అవి ఆరోగ్యంగా పెరిగి పెద్దవుతాయి. పిల్లలు కూడా మొక్కలవంటి వారే. సరైన పోషణ ఇస్తే వాళ్ళు కూడా చక్కగా పెరుగుతారు. మంచి మనుషులుగా మారతారు. మదర్ థెరిసా వీధుల్లో దిక్కులేక పడివున్న పిల్లల్ని శిశుభవన్‌కి తీసుకొచ్చి వాళ్ళకి పోషణ కల్పించి, మంచి మనుషులుగా ఎలా తీర్చిదిద్దవచ్చో చూపించింది. సరైన మార్గంలో వెళ్ళి వీళ్ళు ఎవరి సహాయమూ లేకుండా ఉండగలుగుతారు. సమాజంలోని మిగతా మనుషుల్లా బతకగలుగుతారు.

కలకత్తాలోని నిర్మలా భవనం కాక 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' కుష్టురోగుల కోసం సేవాకేంద్రాలు తెరిచిన చోటల్లా పిల్లలకోసం కూడా భవనాలు స్థాపించారు. జబ్బుతో తీసుకునే పిల్లలు వీటిల్లో ఉంటారు. ఈ బాలభవనాలు వారి ప్రేమకి ఉదాహరణలు.

ప్రతీ పిల్లవాడు తలిదండ్రుల ప్రేమ కావాలను కుంటాడు. ఈ ఉద్దేశంతోనే బాలభవనం లోని పిల్లల్ని దత్తత తీసుకోడం జరుగుతుంది. దత్తత తీసుకోటంలో ఫ్రెంచి వాళ్ళు అందరికన్నా ముందున్నారు. ఈ మధ్యన మన దేశంలోని హిందువులు కూడా ఎక్కువగా దత్తత తీసుకోటానికి ముందుకొస్తున్నారు.

**సియాల్‌దహ్‌లోని నౌశావాస్, అంటే రాత్రి నివాసం :**
సియాల్‌దహ్ స్టేషన్ దరిదాపుల్లోని వీధుల్లో చాలామంది బిచ్చగాళ్ళుంటారు. 1947లో దేశ విభజన జరిగి స్వాతంత్ర్యం దొరికినప్పుడూ, 1971లో బంగ్లాదేశ్ విముక్తి యుద్ధం మొదలైనప్పుడూ ఇండియాలోకి వరదలా వచ్చిన జనం సియాల్‌దహ్‌లో స్థిరపడిపోయారు. 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' లో పని చేసే సిస్టర్లు అప్పట్నుంచీ ఈ కాందిశీకులకి సహాయపడటం మొదలు పెట్టారు. ఈ గుంపులో అనాధలైన పిల్లల్ని వెతికి వాళ్ళని ఆ సిస్టర్ల శిశుభవనానికి తీసుకునివచ్చేవారు.

ఆతరువాత 1973లో సియాల్‌దహ్‌లో వాళ్ళు నౌశావాస్ తెరిచారు. ఉండటానికి ఇల్లులేని వాళ్ళు రాత్రిళ్ళు ఇక్కడికి వచ్చి పడుకుంటారు. పిల్లలకి యిక్కడ ఉండటానికి చోటేకాక రొట్టె, పాలూ కూడా ఇస్తారు.

ఏ పిల్లవాడైనా వీధిలోంచి వంద పచ్చికొబ్బరి చిప్పలు ఏరుకుని వచ్చి ఇచ్చినట్టయితే, ఆ అబ్బాయికి పదహారు బిస్కట్లు కానీ, ఒక పౌను డబల్‌రొట్టి కానీ ఇస్తారు. పిల్లలు కొబ్బరి చిప్పలు తెచ్చి సియాల్‌దహ్ స్టేషన్లో నాలుగో నెంబరు గేటుదగ్గర పోగేస్తారు. వారానికి రెండుసార్లు ఒక లారీలో ఈ చిప్పల్ని నింపి, తిల్‌జలాలోని ప్రేమదాన్ కేంద్రానికి పంపిస్తారు.

సియాల్‌దహ్‌లోని నౌశావాస్ (రాత్రినివాస్)లో 1973లో పని ప్రారంభం అయింది. ఇక్కడ దాదాపు ఎనిమిది వందలమంది పిల్లలు ఉంటారు. వారి చేత స్నానం చేయించటం, వారిని శుభ్రంగా ఉంచటం పట్ల చాలా శ్రద్ధ కనబరుస్తారు. వారికి భోజనం కూడా దొరుకుతుంది. చదువు నేర్పిస్తారు. సాధారణంగా ఇక్కడ ఎనిమిది నుంచి పది సంవత్సరాలున్న పిల్లలే ఉంటారు.

రాత్రినివాస్‌లోని పిల్లలకి నాలుగోక్లాసుదాకా చదువు నేర్పాక, వారిని బైఠక్ ఖానా లోని ప్రతిమాసేన్ స్కూలుకి పంపిస్తారు. ఇది సెంట్ ఏన్ చర్చిదగ్గరుంది. ఇక్కడ ఎనిమిదో క్లాసు దాకా చదువుకుంటారు. ఇక్కడ చేతి పనులు కూడా నేర్పుతారు.

**తిల్‌జలాలోని ప్రేమ్‌దాన్ కేంద్రం :** సియాల్‌దహ్ నుంచి పచ్చి కొబ్బరి చిప్పల్ని ప్రేమ్ దాన్ కేంద్రానికి తీసుకొచ్చి వాటిని ఇక్కడ ఎండబెట్టి, చిప్పలకున్న పీచుని విడిగా తీస్తారు. తరువాత దానితో తాళ్ళు, చాపలు, కంబళ్ళు, సంచీలు తయారు చేస్తారు.



ప్రేమ్‌దాన్ కేంద్రంలో దాదాపు మూడువందలమంది పనిచేస్తారు. వీళ్ళందరూ వికలాంగులు. వీళ్ళే కాక బుద్ధి మందగించినపిల్లలూ, చావుబతుకుల్లో ఉన్నవాళ్ళు కూడా ఇక్కడ ఉన్నారు. సరైన పోషణ లేక జబ్బుగా ఉన్న పిల్లల్ని కూడా ఇక్కడికి తీసుకువస్తారు.

1973 లో ఐ.సి.ఐ. మదర్‌కి ఈ ఇల్లు దానంగా ఇచ్చింది. అదే సంవత్సరం ఏప్రిల్ 5వ తేదీన పశ్చిమ బెంగాల్‌లో అప్పుడు గవర్నర్‌గాఉన్న ఎ.ఎల్.డయాస్

ప్రేమ్‌దాన్ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

**నిర్మలా కెనెడీ కేంద్రం :** ప్రేమ యొక్క ఇంకో నెలవు 'నిర్మలా కెనెడీ కేంద్రం'! ఇది దమ్ దమ్ ఏర్ పోర్టుకీ న్యూ ఆలీపూర్‌కీ దగ్గర్లో ఉంది. 1971 లో బంగ్లాదేశ్ నుంచి వచ్చిన కాందిశీకుల కోసం ఇక్కడ ఒక గుడారం ఏర్పాటు చేశారు. కాందిశీకులు వెళ్ళిపోయిన తర్వాత మదర్ థెరిసా అక్కడ ఈ కేంద్రానికి పునాది వేసింది. దీని వ్యవహారమంతా సిస్టర్ క్లేయర్ చూసుకునేది. ఆమె అసలు పేరు కిరణ్‌దత్. జస్సోర్ రోడ్డు పక్కన ఒకపెద్ద ఆవరణలో ఈ కేంద్రం స్థాపింపబడింది. అవిటివాళ్ళకీ, బుద్ధిమందగించిన వాళ్ళకీ, చావు బతుకుల్లో ఉన్నవాళ్ళకీ ఇక్కడ చోటిచ్చి వాళ్ళకి సేవ చేస్తారు. పైదేశాల వాళ్ళుకూడా ఇక్కడికొచ్చి ఈ పిల్లలకి సేవ చేస్తారు. అవసరమైతే మొగుళ్ళని వదిలేసిన స్త్రీలని కూడా ఇక్కడ ఉండనిస్తారు.

**టీటాగఢ్‌లోని గాంధీజీ ప్రేమ్ నివాస్ :** మదర్ థెరిసా కుష్టురోగుల కోసం మొట్టమొదటి సారిగా సంచార మందుల షాపుని తెరిచింది. 1957లో అటువంటి మందుల షాపుకి ఆర్చ్‌బిషప్ పెరియార్ ప్రారంభోత్సవం చేశారు. పేరుపొందిన డాక్టర్ సేన్ వీరిని బాగుచెయ్యటానికి తన సేవలను అందించారు. ఆతరువాత టీటాగఢ్ రైల్వేలైను పక్కన ఒక పెంకుటింట్లో చికిత్సా కేంద్రం ఏర్పాటు చేశారు. కొన్నాళ్ళ తరువాత ఈ కేంద్రాన్ని సుస్థిరం చేశారు. 1958లో గాంధీజీ ప్రేమ్‌నివాస్ స్థాపించబడింది. ప్రేమకి ఇంకో నిలయం ఏర్పడింది. ఈ కేంద్రం యొక్క బాధ్యత 'బ్రదర్స్ ఆఫ్

ఛారిటీ' కి అప్పచెప్పబడింది. ఇది మిషనరీ ఆఫ్ ఛారిటీ తో కలిసి పనిచేసే ఇంకొక సంస్థ. 1963లో మదర్ థెరిసా బ్రదర్స్ (సోదరులు) ను మొదటిసారి సేవా కార్యాల్లో పాల్గొనమని ప్రోత్సహించింది.

**శాంతినగర్ కుష్టురోగ ఆసుపత్రి :** 1961 లో అసన్సోల్ దగ్గరున్న శాంతినగర్‌లో పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం ఒకరూపాయి అద్దెకి మదర్ థెరిసాకి 34 ఎకరాల భూమి లీజ్‌కిచ్చారు. కలకత్తానుంచి ఇది దాదాపు 300 కిలో మీటర్ల దూరంలో ఉంది. మదర్ ఇక్కడ కుష్టురోగులకి ఆస్పత్రీ, పునరావాస కేంద్రం ప్రారంభించింది. జబ్బు నయమయాక కావాలంటే వాళ్ళు తమ కుటుంబాలతో సహా ఇక్కడ ఉండవచ్చు. చేతి పనులు చేసుకుంటూ డబ్బు సంపాదించి తమకయే ఖర్చు భరించవచ్చు.

శాంతినగర్‌లో కుష్టురోగుల ఆశ్రమాన్ని స్థాపించటానికి చాలా ఖర్చయింది. ఆ ఖర్చులో చాలా భాగం ఒక మోటారుకారును లాటరీలో అమ్మితే వచ్చిన డబ్బుతో పూర్తయింది. ఆ కారు చాలా విచిత్రమైన పరిస్థితుల్లో మదర్ థెరిసాకి దొరికింది.

1965 నాటి మాట. ఆ ఏడు ఆరవ పోప్ భారతదేశానికి వచ్చారు. పోప్ కోసం అమెరికన్లు ఒక ఖరీదైన కారుని మన దేశానికి పంపారు. కారుపేరు లింకన్ కాంటినెంటల్ లిమోజిన్. పోప్ మన ప్రభుత్వ అతిథిగా వచ్చారు. ఆయన ఆ కారులో తిరిగారు. 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' చేసే పని చూశారు. ఆయన కాళీఘాట్ లోని 'నిర్మల్ హృదయ్' కి

వెళ్ళి అక్కడ చావు బతుకుల్లో ఉన్నవారికి ఎలా సేవలందిస్తున్నారో చూశారు. అది చూసి ఆయన చాలా ఆనందించారు. మనదేశాన్ని విడిచి వెళ్ళేప్పుడు ఆయన లిమోజిన్ కారుని తనతో తీసుకు పోలేదు. దాన్ని ఆయన మదర్ థెరిసాకి కానుకగా ఇచ్చారు. మదర్ థెరిసాకి కారుకన్న డబ్బుతో ఎక్కువ అవసరం. అందుచేత ఆమె లాటరీలో ఆకారుని అమ్మేసింది. ఆమెకి కారు విలువకన్నా హెచ్చుగానే డబ్బు దొరికింది. ఆ డబ్బుతోనే ఆమె శాంతినగర్‌లో ఆస్పత్రి భవనం కట్టించటం ప్రారంభించింది. ఆ తరువాత అక్కడ కుష్టురోగులకోసం ఒక పునరావాస కేంద్రం కూడా కట్టబడింది. శిశుభవనం కూడా నిర్మించబడింది. జర్మనీలోని యువకులు కూడా చందాలు పోగుచేసి సహాయం చేశారు.

మదర్ థెరిసా సహకారంతో ఇప్పటికి మనదేశంలో కుష్టురోగుల కోసం ఏభై ఆస్పత్రులు తయారయాయి. ప్రపంచంలోని ఇతర దేశాల్లో కూడా ఆమె కుష్టురోగం నయం చెయ్యటానికి కేంద్రాలు నెలకొల్పింది. ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా, మిడిల్ ఈస్టు- దాదాపు ముప్పైదేశాలలో ఆమె ప్రారంభించిన కుష్టాశ్రమాలు నడుస్తున్నాయి. ఈ కేంద్రాలు ఊరిబైట నెలకొల్పబడ్డాయి.

భారత దేశంలో దాదాపు నలభైలక్షలమంది కుష్టు రోగులున్నారు. ప్రపంచం మొత్తం మీద వీళ్ళసంఖ్య బహుశా ఒకకోటి ఇరవై లక్షల దాకా ఉండవచ్చు. ఈ భూమ్మీదనుంచి ఈ రోగాన్ని నిర్మూలించాలని మదర్ థెరిసా అనుకుంది.

**కాళీఘాట్‌లోని నిర్మల్ హృదయ్ :** వీధుల్లో బతుకుతూ



రోగంతోనూ, ముసలితనంతోనూ చావునెదురు చూసే దిక్కులేని వారిని కాళీ ఘాట్‌లోని 'నిర్మల్ హృదయ్' కి తీసుకువస్తారు.

ఈ ఇల్లు కాళికా దేవాలయాన్ని ఆనుకుని ఉంది. కాళీఘాట్ రోడ్డుకీ, కాళీ దేవాలయానికీ జంక్షన్‌లో ఉంది. ఒకసారి 1997 ఆగస్టు 24వ తేదీన నేను, నామిత్రుడు విమల్ సాహాతో కలిసి ఉదయం తొమ్మిది గంటలకి అక్కడకి వెళ్ళాను. మన దేశంలోని వాళ్ళూ, విదేశీయులూ ఎంతో మంది అక్కడ చావు బతుకుల్లో ఉన్నవాళ్ళకి సేవ చేయడం చూశాను. ఒకరు మందు తాగిస్తున్నారు, కొందరు కాళ్ళూచేతులూ పడుతున్నారు. ఇద్దరు విదేశీయులు మలం

శుభ్రం చెయ్యటంకూడా చూశాను. చనిపోయే ముందు వారికి మనుషుల ఆదరాభిమానాలు దొరకాలని వారి ప్రయత్నం. ఇంతకన్నా మంచి విషయం ఏముంటుంది ? వాళ్ళల్లో కొందరు మందులవల్లా, సేవా శుశ్రూషలవల్లా కోలుకుని తమ కాళ్ళ మీద తాము నిలబడగలుగుతారు.

1952 ఆగస్టు 22న కలకత్తా మహానగరంలోని ఈ ఇల్లు మదర్ థెరిసాకి ఇవ్వబడింది. ఆమె అక్కడ 'నిర్మల్ హృదయ్' ని నెలకొల్పారు. మొదట దేవాలయంలోని పురోహితులూ, కొందరు హిందూ మతోన్మాదులూ ఇది పనికిరాదన్నారు. ఇదేదో క్రిస్టియన్ల పన్నాగమని వారు అనుకున్నారు. కాని తరువాత అక్కడ మతం మార్పిడి జరగటంలేదని, పైగా చనిపోయిన వారికి కర్మకాండలు కూడా వాళ్ళ మతానికి అనుకూలంగానే జరపబడుతున్నాయనీ తెలుసుకుని వాళ్ళు ఊరుకున్నారు.

కాళీఘాట్‌లోని 'నిర్మల్ హృదయ్' నిజంగానే ప్రేమకి నిలయం.

## 12. స్వదేశం నుండి విదేశానికి

మదర్ థెరిసా భారత దేశంలో పుట్టనప్పటికీ ఆమె మనదేశంలోని ఒక గొప్ప వ్యక్తి. ఆమె కలకత్తాని తన కార్యక్రమానికి కేంద్రంగా ఎంచుకుంది. ఇక్కడి నుంచి ప్రారంభించి ఆమె దేశమంతా తన సేవలని అందజేసింది. ఆ తరువాత ప్రపంచంలోని వివిధ దేశాల్లో 'మిషనరీజ్ ఆఫ్

ఛారిటీ' యొక్క శాఖలని విస్తరింపజేసింది.

1960లో ఆర్చ్‌బిషప్ నుంచి కలకత్తా బైట కేంద్రం నెలకొల్పటానికి మదర్ థెరిసాకి అనుమతి దొరికింది. చర్చినియమం ప్రకారం దానికి సంబంధించిన ఏ సంస్థ అయినా, ఏ సమితి అయినా పదేళ్ళపాటు ఆ ప్రాంతంలోనే పని చేయాల్సి ఉంటుంది. పదేళ్ళ తరువాత బైట ఎక్కడైనా ఈ పనిని మొదలు పెట్టవచ్చు. 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' కి 1950లో పోప్ అనుమతి లభించింది. సరిగ్గా పదేళ్ల తరువాత మదర్ థెరిసాకి రాంచీలోని ఒక ఆదివాసుల ప్రాంతంలో దీని శాఖ తెరవటానికి అనుమతి లభించింది.

ఆ తరువాత ఢిల్లీలో అప్పటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ స్వయంగా 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' భవనానికి ప్రారంభోత్సవం చేశారు. నెహ్రూ మదర్ థెరిసా పేరును 'పద్మశ్రీ' బిరుదు కోసం రాష్ట్రపతికి సూచించారు. భారతదేశంలో జన్మించని వ్యక్తికి మొట్టమొదటిసారి 'పద్మశ్రీ' బిరుదు లభించింది. 1962లో భారతదేశం ఆమెని 'పద్మశ్రీ' తో సత్కరించింది.

1961లో 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' యొక్క కొత్త భవనాలు ఆగ్రాలోనూ, ఝాన్సీలోనూ కట్టించారు. ఆతరువాత దేశంలోని అనేక పెద్దనగరాల్లో భవనాలు కట్టారు. పాట్నా, అంబాలా, డార్జిలింగ్, గోవా, భాగల్పూర్, ముంబయి, అమరావతి నగరాల్లో భవనాలు కట్టించారు. 1991నాటికి 168 భవనాలు కట్టటం పూర్తయింది. ఇప్పుడు వీటి సంఖ్య ఇంకా పెరిగింది.

మదర్ థెరిసా విదేశాల్లో తెరిచిన కేంద్రాల విషయాని

కొద్దాం. 1965లో ఆమె వెనెజూఎలా లోని కాక్‌రోట్ లో ఒక కేంద్రం నెలకొల్పింది. ఆర్చ్‌బిషప్ పెరియార్‌కి ఇది ఇష్టం లేదు. పోప్ ప్రతినిధి ఆర్చ్‌బిషప్ నక్సీ ఢిల్లీలో ఆయన్ని కలిసి అనుమతిమ్మని అడిగారు. అప్పుడు ఆయన అంగీకరించారు. 1965లో మదర్ థెరిసా సంస్థకి రోమ్ వాటికన్ నుంచి సమర్థన లభించింది. ఈ సంస్థ పూర్తిగా పోప్ ఆధీనంలోకి వెళ్ళిపోయింది. మదర్‌కి పోప్ నుండి అధికారం లభించింది.

1968లో విదేశాల్లో మదర్ రెండో శాఖ నెలకొల్పింది. 1969లో ఆస్ట్రేలియాలో రెండు కేంద్రాలకి ప్రారంభోత్సవం జరిగింది. 1970లో వెనెజు ఎలా లో మరో రెండు కేంద్రాలు తెరవబడ్డాయి. ఆ తరువాత బంగ్లాదేశ్, బ్రెజిల్, పనామా, ఉత్తర ఐర్లండ్, జపాను, గాజాస్ట్రిప్, ఇథియోపియా, సిసిలీ, ఫిలిపీన్స్, న్యూయార్క్ లోని బోక్స్, పాపు ఆన్యూగినీ, బురుండీ మొదలైన దేశాల్లోనూ, అనేక ప్రాంతాల్లోనూ కేంద్రాలు నెలకొల్పబడ్డాయి. అల్బేనియాలోనూ, వాటికన్‌లో కూడా కేంద్రాలు తెరిచారు.

1990 నాటికి మదర్ థెరిసా ప్రపంచంలోని వివిధ దేశాల్లో తన సేవలని విస్తరింపజేసిందని వినికిడి. దాదాపు వంద దేశాల్లో 456 కేంద్రాలని ఆమె నెలకొల్పింది.

ఈ కేంద్రాల్లో పని చేసే 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' సిస్టర్లకి సహాయం చెయ్యటంలో 'బ్రదర్స్ ఆఫ్ ఛారిటీ' లోని సోదరులు వెనకడుగు వెయ్యరు. ముఖ్యంగా కుష్టురోగుల ఆస్పత్రుల్లో ఈ సోదరులు రోగులకి చేసే సేవ చూస్తేగాని నమ్మలేం. అంత మనస్ఫూర్తిగా, ఒళ్ళుదాచుకోకుండా సేవచేస్తారు.

భారతదేశం పరాధీనంగా ఉన్నప్పుడు సేవద్వారా దేశాన్ని నిర్మించాలన్న ఉదాహరణ స్వామి వివేకానంద చూపించారు. స్వతంత్ర భారతంలో సేవ ద్వారా దేశాన్ని ఉద్ధరించటానికి సహాయపడింది మదర్ థెరిసా.

## 13.మదర్ ఇక లేరు

1997 సెప్టెంబరు 5వ తేదీ శుక్రవారం. రాత్రి తొమ్మిదిన్నరకి కలకత్తాలోని 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' ముఖ్యకార్యాలయం 'మదర్ హౌస్'లో విశ్వజనని మదర్ థెరిసా ఆఖరి శ్వాస విడిచింది. ఆమె వయసు 87 ఏళ్ళు.

ఈ కబురు రాత్రి 11 గంటల 35 నిమిషాలకి అందరికీ తెలిసింది. సిస్టర్ నిర్మల 'మదర్ హౌస్' ముఖద్వారం వద్ద నిలబడి, అక్కడికొచ్చిన జనాన్నీ, విలేఖరులనీ ఉద్దేశించి 'మనందరికీ ఎంతో ప్రియమైన మదర్ థెరిసా ఈ రోజు రాత్రి తొమ్మిదిన్నరకి' ఏసు ప్రభువు వద్దకు వెళ్ళిపోయింది. గుండె జబ్బుతో ఆమె మరణించింది. 'రండి, మనందరం కలిసి ఆమె ఆత్మ శాంతికై ప్రార్థిద్దాం', అన్నది.

సిస్టర్లను అడిగితే మదర్ రోజంతా మామూలుగానే ఉందని తెలిసింది. మధ్యాహ్నమూ, రాత్రీ ఆమె రోజులాగే సాదా భోజనం చేసింది. రాత్రి ఏడుముప్పావుకి 'నా గుండెలో నెప్పిగా ఉంది' అంది. వెంటనే డాక్టర్ ఆల్బర్ట్ వుడ్‌వర్క్‌ని పిలిపించారు. దగ్గర్లో ఉన్న ఇంకొంత మంది డాక్టర్లకి కూడా కబురు చేశారు.

డాక్టర్లు మదర్‌కు కృత్రిమ శ్వాస కల్పించటానికి ప్రయత్నించారు. కాని ఆమె శరీరం నిర్జీవమయి పోయింది. చివరికి ఆమె చేయెత్తి ఆఖరి మాటగా, 'నాకు ఇక ఊపిరాడటం లేదు' అన్నది. డాక్టర్ల ప్రయత్నం ఫలించలేదు.

మదర్ థెరిసా భౌతిక కాయాన్ని ఆమె కిష్టమైన ఊరు, కలకత్తాలోనే ఉంచారు. ఆమె భౌతిక కాయాన్ని 'మదర్ హౌస్' లోనే పాతిపెట్టారు. కలకత్తా కార్పొరేషన్ 'మదర్ హౌస్' ని ఒక చరిత్రాత్మక భవనంలాగ కాపాడుతుందని కలకత్తా మేయర్ ప్రశాంత్ చటోపాధ్యాయ అన్నారు.

మదర్ శవాన్ని సెప్టెంబరు 7వ తేదీన ఆదివారం ఉదయం మిడిల్ టౌన్ గుండా సెంట్ దామస్ చర్చికి తీసుకెళ్ళారు. సెప్టెంబరు 12 వరకూ జనం దర్శించుకోవటం కోసమని అక్కడ ఉంచారు. మదర్‌ని ఆఖరిసారి చూడటం కోసం జనం గుంపులు గుంపులుగా వచ్చారు.

శనివారం సెప్టెంబరు 13న అధికార లాంఛనాలతో మదర్ అంతిమ యాత్ర పూర్తయింది. ఆ సమయంలో దేశ విదేశాల ప్రముఖులు కలకత్తాకి వచ్చారు. ప్రపంచంలోని అందరి కళ్ళూ కలకత్తా మీదే ఉన్నాయి.

మదర్ మరణానికి సంతాపం తెలుపుతూ రెండవ పోప్ జాన్‌పాల్, 'ఈ శతాబ్దపు చరిత్రలో ఆమె సేవలు ఎప్పటికీ జ్ఞాపకం ఉండిపోతాయి' అని అన్నారు. భారతదేశ రాష్ట్రపతి కె. ఆర్. నారాయణన్, ' ఆమె ఒక దేవదూత' అన్నారు. ప్రధాన మంత్రి ఇంద్రకుమార్ గుజరాల్, 'ఆమె వంటి వ్యక్తి మరణిస్తే శోకం ప్రకటించటానికి ఎన్నిమాటలు

చెప్పినా చాలవు,' అన్నారు. పశ్చిమ బెంగాలు ముఖ్యమంత్రి జ్యోతిబసు, ' ఒక గొప్ప మానవతావాది మనని విడిచి వెళ్ళి పోయింది,' అన్నారు. సీతారాం కేసరి, ' ఆమె అందరికీ అమ్మ' అన్నారు. అమెరికా రాష్ట్రపతి బిల్‌క్లింటన్, ' ఆమె వ్యక్తిత్వం చాలా అరుదైనది. ఆమె బీదవారికీ, పీడితులకీ, చావుబతుకుల్లో ఉన్నవారికీ ఎనలేని సహాయం చేసింది,' అన్నారు. ఇంగ్లండు ప్రధాని టోనీ బ్లేయర్, 'మదర్ మనందరికీ ప్రేరణగా నిలిచింది', అన్నారు. ప్రపంచంలోని మిగతా చాలా దేశాలూ, సంస్థలు తమ శోకాన్ని తెలిపాయి.

శనివారం సెప్టెంబరు 13, 1997. ఆరోజు మదర్ థెరిసా అంతిమ క్రియలు అధికార లాంఛనాలతో జరిగాయి. ఉదయం 9 గంటలకి మదర్ శవాన్ని సాయుధ శకటం మీద పెట్టాక, సెంట్ థామస్ చర్చి నుండి నేతాజీ ఇండోర్ స్టేడియం వరకూ తీసుకురావటానికి నలభై ఐదు నిమిషాలు పట్టింది.

ఉదయం 10 గంటలకి దేశ విదేశాల ప్రముఖులూ, కలకత్తాలోని 12 వేల మంది ప్రజల సమక్షంలో నేతాజీ ఇండోర్ స్టేడియంలో మదర్ అంతిమక్రియలు ప్రారంభమయాయి. మదర్ శవపేటికని స్టేజి మీద పెట్టగానే సిస్టర్లందరూ మదర్‌కు ఇష్టమైన బెంగాలీ పాట, ' అగున్‌రే పరస్‌మతి ఛో ఆఓ ప్రానే' (నిప్పుతో చేసిన పరశువేదిని ప్రాణాలకు తాకించు) పాడటం మొదలు పెట్టారు.

అంతిమ క్రియల ఏర్పాట్లు పర్యవేక్షించటానికి మత నిర్వాహకులు ఐదుగురు ఒక సమితిగా ఏర్పడ్డారు. వీరికి

నాయకునిగా పోప్ యొక్క ప్రతినిధి, వాటికన్ సెక్రెటరీ ఆఫ్ స్టేట్, కార్డినల్ ఎంజెలో సొదానో వ్యవహరించారు. రోమన్ కాథలిక్ నియమాల ప్రకారం ఈ ఏర్పాట్లు పూర్తవగానే సర్వధర్మప్రార్థన ప్రారంభమయింది. భగవద్గీతలోని శ్లోకాలూ, కురానులోని పద్యాలూ, గురువాణీలోని ప్రార్థనలూ చదువుతూ మదర్ ఆత్మశాంతికై ప్రార్థించారు. ఆ తరువాత ముఖ్యులు మదర్‌కి శ్రద్ధాంజలులు అర్పించవలసి ఉంది. భారతదేశ రాష్ట్రపతి మొదలుకొని దాదాపు ఏభై దేశాల ప్రముఖులు పువ్వులతో మదర్‌కి శ్రద్ధాంజలి సమర్పించుకున్నారు.

ఆప్రముఖుల్లో భారత రాష్ట్రపతి కె. ఆర్. నారాయణన్, ప్రధాని ఇంద్రకుమార్ గుజరాల్, లోక్‌సభలోని ప్రతిపక్షనాయకుడు అటల్ బిహారి వాజపేయీ, పశ్చిమ బెంగాలు ముఖ్యమంత్రి జ్యోతిబసు, సోనియాగాంధీ, ఇటలీ ప్రెసిడెంట్, బంగ్లాదేశ్ ప్రధాన మంత్రి, అల్బేనియా రాష్ట్రపతి, ఘానా రాష్ట్రపతి, అమెరికా ప్రథమ మహిళ హిలరీ క్లింటన్, జోర్డన్ రాణి, స్పెయిన్ రాణి, బెల్జియమ్ రాణి మొదలైనవారు ఉన్నారు.

కార్యక్రమం ముగిశాక ఒంటిగంటా ఇరవై నిమిషాలకు మదర్ శవాన్ని 'మదర్ హౌస్'కి తరలించారు. ఆ ఇంటి విలాసం, 54 ఏ, ఆచార్య జగదీశ్ చంద్ర బసు రోడ్. మధ్యాహ్నం రెండుగంటల ఏభై ఐదు నిమిషాలకి 'మదర్ హౌస్' లోని మొదటి అంతస్తులోని హాల్లో మదర్‌ని సమాధి చేశారు. సమాధి కోసం చేసిన గొయ్యి కాంక్రీటుది. శవాన్ని

ఆగోతిలోకి దింపగానే మిలిటరీ బ్యాండు వీడ్కోలు సంగీతం వాయించింది. మిలిటరీకి చెందిన ఆటోమేటిక్ రైఫిళ్ళు ఆకాశంలోకి మూడు సార్లు గుళ్ళు పేల్చాయి.

పోప్ ప్రతినిధి, ఎంజెలోసొదానో, ఒక లోహపాత్రలో నుంచి గుప్పెడు ఇసుక తీసుకొని శవపేటిక మీద చల్లారు. సిస్టర్లందరూ ఏసు క్రీస్తు పాటలు పాడసాగారు.

సొదానో పక్కనే నిలబడ్డ సిస్టర్ నిర్మల, సిస్టర్ ఫ్రెడరిక్, సిస్టర్ శాంతి, మదర్ మేనకోడలు ఐగీ బోజాక్ష్యకూడా గుప్పెడు ఇసుక తీసుకుని శవపేటిక మీద చల్లారు. ఆతరువాత సమాధి గొయ్యి ఇసుకతో నింపబడింది. ఆ కాంక్రీటు గొయ్యి నేలకి రెండున్నర అడుగుల ఎత్తు ఉంది. సాయంకాలం ఐదు ముప్పావుకి సమాధిని కాంక్రీటు మూతతో మూసివేశారు.

ఆతరువాత అంతా అయిపోయింది. ఆరోజు ప్రపంచమంతా కలకత్తానే చూస్తోంది. మదర్ మరణంలాగే ఆమె అంతిమ యాత్ర కూడా ఒక అంతర్జాతీయ సంఘటనే అయింది.

మదర్ వెళ్ళిపోయింది, కాని ఆమె చేసిన పని, ఆమె జ్ఞాపకాలు మిగిలున్నాయి. ఆధునిక భారతదేశంలోని ఒక గొప్ప మానవతావాదిగా ఈ దేశ చరిత్రలోనూ, ప్రజల నోళ్ళలోనూ ఆమె జీవించే ఉంటుంది. భారతదేశ ప్రజలు ఆమెని ఎన్నటికీ మరిచిపోరు.

# పురస్కారాల వివరణ

కేవలం భారతదేశ ప్రజలే కాకుండా, మదర్ థెరిసాని అభినందించి, పురస్కారాలతో సత్కరించిన వాళ్ళల్లో ప్రపంచంలోని అనేక దేశాల ప్రజలున్నారు. మదర్ తరువాత ఈ సంస్థను నడపవలసిన బాధ్యత వాళ్ళందరిది.

1962లో మదర్ థెరిసాని భారతదేశం 'పద్మశ్రీ' తో సత్కరించింది. ఆ ఏడే ఆమెకి ఫిలిపీన్స్ వారి 'మెగ్‌సేసే పురస్కారం' కూడా లభించింది.

1965 లో ఆరవ పోప్ పాల్ అమెరికన్లు తనకు బహుమతిగా ఇచ్చిన కారుని భారతదేశం వదలి వెళ్ళేటప్పుడు మదర్‌కి కానుకగా ఇచ్చారు. ఆకారు పేరు లింకన్ కాంటినెంటల్ లిమోజిన్.

1971 జనవరి 6వ తేదీన ఆరవపోప్ పాల్ చేతులమీదుగా ఆమెకి 'పోప్‌జాన్ ఇరవైమూడో శాంతి పురస్కారం' లభించింది. అదే సంవత్సరం వాషింగ్‌టన్‌లో ఆమెకి 'జాన్ ఎఫ్ కెనెడీ అంతర్జాతీయ పురస్కారం' లభించింది. న్యూయార్క్ వారి 'గుడ్ సామరిటన్ పురస్కారం; కాథలిక్ యూనివర్సిటీ ఆఫ్ అమెరికా వారి 'డాక్టర్ ఆఫ్ హ్యూమన్ లెటర్స్' బిరుదు లభించాయి.

1972లో ఆమెకి 'జవహర్ లాల్ నెహ్రూ అవార్డ్ ఫర్

ఇంటర్నేషనల్ అండర్ స్టాండింగ్' లభించింది.

1973 లో మదర్‌కి లండన్‌లో 'ఫౌండేషన్ ప్రయిజ్ ఫర్ ప్రోగ్రెస్ ఇన్ రెలిజియన్' లభించింది.

1975లో ఆమెకి 'అల్బర్ట్ స్వాయిస్జర్ అంతర్జాతీయ పురస్కారం' లభించింది.

1979లో మదర్ థెరిసాకి 'నోబెల్ శాంతి పురస్కారం' లభించింది.

1980లో మదర్ ని భారతదేశపు అత్యున్నత జాతీయ సన్మానం 'భారత రత్న' ఇచ్చి సత్కరించారు.

1983లో ఇంగ్లండు మహారాణి, రెండవ ఎలిజబెత్ నుండి ఆమె 'ఆర్డర్ ఆఫ్ మెరిట్', సన్మానం పొందారు.

1985లో ఆమె ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశం (యునైటెడ్ నేషన్స్ జనరల్ అసెంబ్లీ) లో ఉపన్యసించారు.

మదర్ థెరిసా ఈ పురస్కారాలన్నీ పేదవారి తరపున తీసుకుంది. ఈ పురస్కారాల వల్ల వచ్చిన ధనాన్ని కూడా ఆమె వారికోసమే ఖర్చుపెట్టింది.

## సంకలనం
## సిస్టర్ నిర్మల

మదర్ థెరిసా బతికుండగానే, 1997 మార్చి 13న సిస్టర్ నిర్మల 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' కి సుపీరియర్ జనరల్‌గా, సిస్టర్ల వోటు పొంది, ఎన్నుకోబడింది.

ఆమె అసలుపేరు నిర్మలా జోషి. ఆమె రాంచీలో పుట్టింది. బహుశా 1935 లో - ఆమె తండ్రి భారతీయ సేనలో పని చేసేవారు. నిర్మలా, ఆమె సోదరి, పాట్నా విమెన్స్ కాలేజీలో చదువుకునేవారు. ఆ రోజుల్లోనే ఆమె క్రిస్టియన్ మతంవైపు ఆకర్షింపబడింది.

ఆమె 1958లో 'మిషనరీజ్ ఆఫ్ ఛారిటీ' లో చేరారు.



Lasertypeset at Sai Graphics, Hyderabad -29 and printed at
Shivam Offset Press, New Delhi - 28